శ్రీః

# హనుమద్విజయము

అధ్యాయత్రితయాత్మకము

కర్త,

'గీతానిధి' కొత్త సచ్చిదానందమూర్తి.

శ్రీమతి జంపాల లక్ష్మీనారాయణమ్మగారి సంపూర్ణ
ద్రవ్యసాహాయ్యముతో

తెనాలి జానకిరాం ప్రెస్సులో ముద్రించి ప్రకటింపబడినది.



బహుధాన్య వత్సరము 1938



వెల రు 0—6—0

శ్రీః.

శ్రీ జానకీ వల్లభో విజయతే.

ఆంజనేయ ప్రసాద సిద్ధిరస్తు.

# హనుమద్విజయము

అధ్యాయ త్రితయాత్మకము.



1938.

చామర్లపురి.

కర్త,

శ్రీ కొత్త సచ్చిదానందమూర్తి

శ్రీ జానకీ వల్లభో విజయతే.

అంకితము

# మారుతికి

ఇట్లు,

మారుతి చరణారవింద సేవాభక్తుఁడు

శ్రీ కొత్త సచ్చిదానందమూర్తి,

గ్రంథకర్త.



గ్రంథకర్త:

'గీతానిధి' కొత్త సచ్చిదానందమూర్తి.

# విజ్ఞప్తి.

---

ఆర్యులారా !

శ్రీహరిహరుల సంపూర్ణావతారమును శ్రీరామభక్తాగ్రగణ్యుండును అగు శ్రీమదాంజనేయుని గూర్చిన యనేక చరిత్రములు గలవు. అవి అన్నియుఁ జదువవలె నన్నఁ గాల మెంతయో పట్టును. తచ్చరిత్రము లన్నియుఁ గ్రోడీకరించి వ్రాయఁబడిన గ్రంథ మొక్కటియు నేఁటివఱకు నాకంటఁ బడ లేదు. శ్రీమదాంజనేయ భక్తులకు నీలాటి పొత్త మొకటి యుండినచో శ్రీ స్వామివారి చరిత్రమును సులువుగా నెఱుంగుటకు వీలగునని నే నీ చిన్న పొత్తమును వ్రాసితిని. ఇందలి కథలన్నియు గ్రంథాంతరములనుండియె గ్రహించితిని. 'సధుచ్ఛిష్ట మిదం సర్వ' మ్మనునట్లు నాచే వ్రాయఁబడిన దంతయు సత్పురుషుల యుచ్ఛిష్ట మనియే మనవి చేయుచున్నాను. మఱియు నిందలి యితివృత్తము జగద్విదితమగు రామాయణము నుండియే చాలవఱకు సంగ్రహింపఁబడిన దని యేతద్గ్రంథ ద్రష్టలకు వేఱుగఁ దెలుప నవసరము లేదు. గుణదోషవివేచనము ప్రాజ్ఞులే యొనర్తురుగాక.

ఇట్లు

బుధజనవిధేయుఁడు

కొత్త సచ్చిదానందమూర్తి.

పఁబడు నని యాశించుచు, నట్టి మహాత్కార్యమునకు నన్ని విధములను సామగ్రిని సమకూర్చుకొను ప్రతిభ గల్గుఁగాక యని యాశీర్వదించుచుంటిని.

తెనాలి
సూతాశ్రమం
31—5—38

ఇట్లు,
కవిరాజు
త్రిపురనేని రామస్వామిచౌదరి
శతావధాని, బారిష్టరు.



సంగంజాగర్లమూడి వాస్తవ్యుడును, తొమ్మిదేండ్ల బాలుడును అగు కొత్త సచ్చిదానందమూర్తి అద్భుతమైన తెలివి కలవాడును, పరిశ్రమ చేయువాడును అయి వున్నాడు ఇంత చిన్నవయస్సులోనే, హిందీ, సంస్కృతము, తెలుగు, ఆంగ్లభాషలయందు పెద్ద పాండిత్యము కలిగియుండుట అత్యాశ్చర్యకరము. అతనికన్న ఎక్కువ వయస్సు కలవారుకూడా, ఏరాష్ట్రభాషాపరీక్షను ప్యాసు అవుటకు అతి కష్టపడిరో అట్టి యీపరీక్షనుగూడ ఇతను ప్యాసాయెను. మరియు శ్రేష్టము లైనట్టియు, సాంప్రదాయకము లైనట్టియు అనేక పుస్తకములు చదివెను. అతను నాకు అస్వాభావికుడైన బాలకునివలె కన్పట్టుచున్నాడు. మరియు అతని అద్భుతమైన తెలివి నా

మనసున నాటినది. అతనికి విజయమును, దీర్ఘాయువును, మంచి భవిష్యత్తును కోరుచున్నాను.

ఇట్లు,

యస్. ఆర్. వై. సివరామప్రసాద్ బహద్దుర్

చల్లపల్లిరాజ

గోవిందబాగు క్యాంపు:-బచ్చుపేట, మసులా, 27 డిశంబరు 34

---

కొత్త సచ్చిదానందమూర్తి తొమ్మిదేండ్ల బాలుడు. ఈ పిల్లవాడు ఈ వయస్సునకే అద్భుత తెలివితేటలను చూపించుచున్నాడు. నాగరీ, హిందీ, తెలుగు, ఆంగ్ల యను చతుర్భాషలలో జ్ఞానము సంపాదించినాడు ......

ఇట్లు

గుంటూరు
3-12-33

సి. సత్యనారాయణచౌదరి బి. ఏ, బి. యల్.

అడ్వకేటు, పబ్లిక్ ప్రాసిక్యూటరు,

గవర్నమెంటు ప్లీడరు,

ప్రస్తుతం అనంతపూర్, డిస్ట్రిక్టు జడ్జి

కొత్త వీరభద్రయ్యచౌదరిగారికి

(గ్రంథకర్త పితరులు)

మ. బహుజాగ్రత్త కుశాగ్రబుద్ధి పఠనా
పాఠోత్సుకత్వత్వరా
గ్రహణంబుల్ తమ పట్టికిన్ గడు నిస
ర్గంబుల్ సుమా కాననే
బహుళార్థంబుల గూఢ భావముల సం
భాసించు గీతోక్తి సు
గ్రహముం జేసితి వీరభద్ర సుకృతీ!
కమ్మాన్వయాలంకృతీ!

కం. కాదఁట ప్రథమ పరీక్షయుఁ
గాదట మధ్యమ పరీక్ష కడముట్టఁగ గీ
తోదధి నెల్ల నొకేపరి
ద్వాదశవర్షముల వత్సదాఁటెన్ భళిరా!

మ. నందనుఁడయ్యె మీకు బుధ
నందిత సద్గుణుఁడైన సచ్చిదా
నందము మీరు ప్రాగ్భవమునన్
దపమేమి యొనర్చినారో, యీ
నందనువల్ల మీకుల మ
నంత యశంబు గడించు మీసుతున్

జెందుత మింత కెక్కుడుగ
శ్రీయును ధీయును యశంబు నాయువున్.

హిందూ హైస్కూలు
గుంటూరు
1—2—37

ఇట్లు,
వ్యాకరణాచార్య మధ్వశ్రీ
పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యపండితులు

---

సంగం జాగర్లమూడియొక్క కొత్త సచ్చిదానంద మూర్తి అద్భుతమైన తెలివికల కమ్మవంశీయుడు ... ... ... ... అతను పదియేండ్లవాడయి నప్పటికి తన వయస్సునకు మితిలేని మనోవైశాల్యమును ప్రదర్శించుచున్నాడు. అతను హిందీ, సంస్కృత, తెలుగు, ఆంగ్లములలో పొందిన పాండిత్యమును చూచి, ఎవరునూ ఆశ్చర్యపడకుండావుండరు ... ... ...

గుంటూరు,
1—7—34.

ఇట్లు,
జె. కుప్పుస్వామిచౌదరి M, L. C
డిస్ట్రిక్టుబోర్డు ప్రెసిడెంటు

---

కొత్త సచ్చిదానందమూర్తియొక్క చురుకుదనము, నేర్పు, పరిశ్రమ, అనేకభాషలయందు ప్రవీణతను చూచి సంతసించుచున్నాను. దేవుడు అతనిని ఆశీర్వదించుగాక.

తెనాలి
22—11—33

ఇట్లు,
ఖుశ్యాంశింగ్
తహశీల్దారు

## ఆంధ్ర పత్రిక

## 1936

12 వత్సరములు గల శ్రీ కొత్త సచ్చిదానందమూర్తి రాష్ట్రభాషావిశారద పరీక్షలో ఉత్తీర్ణుడయ్యెను. ఇంతకొద్ది వయస్సులో పైతరగతులయందు ఉత్తీర్ణుడైన ప్రథమ బాలుడు.

స్వకీయ విలేఖరి } 1936 వ సంవత్సర ఆంధ్రపత్రికనుండి.
గుంటూరు

---

మహితాభిలాషి.

శ్రీ కొత్తసచ్చిదానందమూర్తి,

గీతానిధి, రాష్ట్రభాషా విశారద్

జననము రక్తాక్షీవత్సర భాద్రపద బ. ౧౨ గురువారము.

| | |
|---|---|
| **1933** | మధ్యమా |
| **1934** | రాష్ట్రభాష |
| **1936** | విశారద |
| **1937** | గీతాపరీక్ష, ఫిడల్. |

ఈ కవి 12 సం॥ వయస్సులోపలనే మధ్యమ, రాష్ట్రభాష రాష్ట్రభాషావిశారద గీతాపరీక్షల యందుత్తీర్ణుడై ఈ హనుమద్విజయాది గ్రంథములను వ్రాసెను.

ఓమ్

# విషయసూచిక

## ప్రథమాధ్యాయము



## ద్వితీయాధ్యాయము

తృతీయాధ్యాయము





# సంకేతాక్షర వివరణ

1 శ్రీ. వా. రా. వాసుదాసుగారి ఆంధ్రరామాయణము
2 శ్రీ. ఉ. రా. పాపరాజ ప్రణీత రామాయణము
3 శ్రీ. రా. సంస్కృత రామాయణము
4 బా. రా. బాలరామాయణము
5 పు. పురాణములు
6 హ. చ. హనుమంత చరిత్రము
7 శ్రీ. భా. ఆంధ్రభాగతము
8 తు. రా. తులసీదాసరామాయణము
9 కు. రా. కుమార సంభవము
10 గ్ర. స్వ. గ్రంథకర్తవి
11 క. చ. కాళిదాస చరిత్ర
12 శ. రా. ఆంధ్ర శతకంఠ రామాయణము
13 స రా. ఆంధ్ర సహస్రకంఠ రామాయణము
14 ప. రు. ప్రతాపరుద్రీయ మహాకావ్యము
15 ఋగ్వే. ఋగ్వేదము
అ. అధ్యాయము

# ప్రార్థన

శ్లో॥ వర్ణానా మర్థసంఘానాం
రసానాం ఛందసా మపి
మంగళానాంచ కర్తారౌ
వందే వాణీ వినాయకౌ

శ్లో॥ వందే బోధ మయం నిత్యం
గురుం శంకరరూపిణమ్
యమాశ్రితో హి వక్రోఽపి
చంద్ర స్సర్వత్ర వంద్యతే 2

శ్లో॥ సీతారామ గుణగ్రామ
పుణ్యారణ్య విహారిణౌ
వందే విశుద్ధ విజ్ఞానౌ
కవీశ్వర కపీశ్వరౌ 3

శ్లో॥ ప్రసన్నతాం యా నగతాఽభిషేకత
స్తథానమమ్లౌ వనవాస దుఃఖతః
ముఖాంబుజ శ్రీ రఘునందనస్య మే
సదాస్తు సామంజుల మంగళప్రదా 4

శ్లో॥ సాంద్రానంద పయోద సౌభగతనుం
పీతాంబరం సుందరం

పాణౌ బాణశరాసనం కటిలస
త్తూణీర భారం వరమ్,
రాజీవాయత లోచనం ధృత జటా
జూటేన సంశోభితం
సీతాలక్ష్మణ సంయుతం పథిగతం
రామాభిరామం భజే 5

శ్లో॥ అతులిత బలధీప్తం స్వర్ణశైలాభదేహం
దనుజవనకృశానుం జ్ఞానినా మగ్రగణ్యమ్
సకలగుణనిధానం వానరాణా మధీశం
రఘుపతి వరదూతం వాతజాతం నమామి.

తు. రా.

ఇట్లు
గీతానిధి శ్రీ. కా. సచ్చిదానందమూర్తి,
రాష్ట్రభాషావిశారద్
గ్రంథకర్త

---

శ్రీరామ.



# హనుమద్విజయము

## ప్రథమాధ్యాయము

### ఆంజనేయ జననము

శ్రీమంతమగు పరాశరాశ్రమమున కేగి మైత్రేయుం డమ్మునిపుంగవున కంజలియొనర్చి "మునీంద్రా! నన్నీ సందియము బాధించుచున్నది. పరమశివుఁ డాంజనేయుఁడుగా నెందులకాయెనో, యానతిచ్చి, నాసంశయమును వారింపవే" యని సవినయంబుగాఁ బల్కుఁడుఁ బరాశరుండివ్విధంబుగాఁ బల్కఁదొడంగె.

"మైత్రేయా! లోకోపకారార్థము నీవడిగిన ప్రశ్నకు యథాశక్తి నుత్తరమిత్తును సావధానుఁడవై వినుము"— తొల్లి గార్దభుండనెడు రక్కసుఁడొక్కఁడు వేల్పులబాధింప నవ్వారు పరమశివునికడ మొఱపెట్ట శివుఁడు దేవతలతో నిట్లనియె "వేల్పులారా! ఆరక్కసుండు నాభక్తుఁడు, నాఁగావిని విష్ణుమూర్తి కోపముతోఁ బరమశివా! ఏమీ? యీదేవతలును నేనును నీభక్తులము కామా? సెలవయినచో నయ్యసురను

నిమిషములోఁ జంపెద"నని వెడలిపోయి యుపాయముతో వానిని జంపి వచ్చెను.

శివుఁడు సంతసించియిట్లనెను—"శ్రీహరీ! నీమాయలు నేనేమి చెప్పఁగలను. బ్రహ్మాండ స్రష్టవగు నీ ప్రభావంబునాకుఁ దెలియునా?"

శ్రీహరియిట్లనియె —"పరమశివా! నీవే నేను నేనే నీవుకదా" శివుఁడిట్లనియె—"నీవు నాకుంద్రిపుర సంహారములోఁ జేసిన సాయమునకు ముందు శ్రీరామావతారములో నేను నీకు సాయముఁ జేయుదును".

తరువాతఁ గొంతకాలమునకు శ్రీహరిదేవతాప్రార్థితుఁడై శ్రీరామావతారమెత్తఁబూని వేల్పుల నెల్లరఁదనకు సాయ మొనర్ప వానర, భల్లూకరూపములఁ జెందుఁడనెను. అదిగాక సర్వమంత్రాభి మంత్రితయగు నొకశక్తిని బరమశివునకిచ్చెను.

అంతఁ గొన్నాళ్లకుఁ బరమేశ్వరుఁడు పార్వతీదేవితో సరససల్లాపములొనర్చుచుండఁ బార్వతీతనకు వేంకటాచలంబున కేగుఁతలంపు దెలుఁప 'వల్లె'యని సదాశివుండు ప్రియురాలితో నటకేగెను. అందొక్కచో మర్కటమిథునంబును జూచి యయ్యాలిమగలు కామపీడితులై కపిరూపంబులతోఁ గ్రీడింప సాగిరి. అప్పుడు శివుఁడు విష్ణుమూర్తి యొసఁగిన యాతేజ శ్శక్తితోఁ దనశక్తిని బార్వతీదేవియందుఁ బ్రవేశపెట్టెను.

ఆశక్తిని భరింపఁజాలక శైలతనయ యద్దాని నగ్నియం దునిచెను. అగ్నిదానిని వాయునకిచ్చెను. ఆకాలమునఁ గేసరి

యను సుప్రసిద్ధుండగు నొక వానరరాజుండెను. పుంజికస్థల యను నొకయచ్చరలేమ శాపవశంబున నాతనికి భార్య యాయెను. ఆమెపేరంజన, ఆయంజనాదేవి పుత్త్రింబడయం దలంచి ఘోరతపముం గావించెను. ఒకనాండామెతప మొనర్చు చుండంగా నెవరో తాంకినట్లాయెను. అప్పుడామెయెవరునన్నుం దాంకువారన నీక్రిందినుడులు వినవచ్చెను.

"ఓసాధ్వీమణీ! నేనువాయుమూర్తిని నేను తాంకినచో నీపాతివ్రత్యమున కేలాటి భంగమునువాటిల్లనేరదు. నీకచిరకాల ములోనే కుమారుండుదయించును. అనంగా వాయుమూర్తి యామెనుదాంకినపుడు తనయందుంచంబడిన శివతేజమామె యందుం బ్రవేశ పెట్టెను. ఈ వాక్యములవిని యంజనాదేవి యానందించెను. తరువాతనొకనాండు శుభముహూర్తమం దామెకుం బుత్త్రుండుదయించెను. ఆనాండు

శ్లో॥ 'ప్రసన్నదిక్పాంసు వివిక్తవాతం
శంఖస్వనానంతర పుష్పవృష్టి
శరీరిణాంస్థావరజంగమానాం
సుఖాయతజ్జన్మదినంబభూవ

కు॥ రా॥

అన్నట్లు దిక్కులు ప్రసన్నములాయెను. నీరజంబులై తెమ్మెరలువీంచెను. శంఖములు మ్రోగెను. పూలవానగురి సెను. ఒకటననేల హనుమజ్జన్మదినం బెల్లవారికి నానందమిను మడింపంజేసెను. దేవతలునాంటినుండి రాక్షసభయంబువీడిరి. ఆతండు పుట్టంగనే మేనజన్నిదమును గౌపీనమును గానంబడిమె.

ఇట్లావీరుఁడు పుట్టినతోడనే తల్లివలన నాంజనేయుండనియుఁ దండ్రివలన మారుతియనియు నామములచేఁ బ్రసిద్ధుఁడాయెను. ఈ యాంజనేయుఁడు 'మార్గశిరశుద్ధచతుర్దశి' నాఁడు పుట్టెనని కొందఱును, 'వైశాఖబహుళదశమి' నాఁడుపుట్టెనని మఱికొందఱును జెప్పుచున్నారు.

## 2 ఆంజనేయుఁడు వరములఁబడయుట.

ఆంజనేయుఁ డొకనాఁడుయ్యెలలోఁ బరుండి నాకాకలియగుచున్నదనెను. నాఁటికాతఁ డుద్భవించి పదియేను దినంబులేనియుఁగావు. పరిహాసంబున నంజనాదేవి క్షుధితుఁడగు బాలకునకుదయించుచున్న సూర్యునింజూపి వత్సా! అదుగో పండు వైకొమ్మనియెను. ఆంజనేయుఁడు జననీవాక్యమువిన్నతోడనే ఒక్కేటున సూర్యునిదరికుఱికెను. అదిచూచి త్రిలోకవాసులును విస్మయమందిరి.

క. పిల్లతనంబునయందే
చెల్లంబోయిట్టి శక్తి చేకూరినచో
మొల్లమగు యౌవనంబున
నెల్లలఁగాలు నొక్కొయితఁడనుకొంసఁగ

శ్రీ. వా. రా.

అట్లాంజనేయుఁడు మహావేగంబున సూర్యుపై నుఱికి సూర్యుని మ్రింగఁబోయెను. అప్పుడుగ్రహణసమయమగుటచే రాహువచ్చుటికరుదెంచెను. బుభుక్షితుఁడు సర్వమును

భోజనమయంబుగాఁ జూచునట్లు మారుతి యారాహువును గూడ ఫలాంతర భ్రమచే మ్రింగగమకింప రాహువయ్యది యెఱింగి శరగున నింద్రుసమీపించి కలతెఱంగు విన్నవింప నమరేంద్రుం డాగ్రహంబుమైనైరావతాధి రూఢుండై యచ్చోటికి రాఁగనయ్యైరావతంబును సైతము వేఱొక పండను భ్రమతో నాంజనేయుండు మ్రింగనుంకింపఁ గోపావేశంబుతో మహేంద్రుండు తనవజ్రంబు నాతనిపై విసరెను, అప్పుడా వజ్రంబు చెంపకుఁ దాఁకుటచే మారుతి యొడలెఱుంగక మూర్ఛబోయెను. వాయుమూర్తి యదిచూచి ఖేదమంది బాలకు నెత్తుకొని కోపంబుమై నొకకొండ గుహలోఁ గదలక మెదలక యుండెను. వాయుసంచారము లేమిచే నప్పుడు,

క. "వెడలవు విణ్మూత్రంబులు
వెడలదు విశ్వాసమేమి ఖేదిలసంబుల్
జడములయి కట్టెలట్టులు
ముడుచుట చాచుట యసాధ్యముగఁ బ్రజకయ్యెన్"

శ్రీ. వా. రా.

మఱియు వేదపారములును హోమములును శూన్యములయ్యెను. నిత్యకర్మములెల్ల నీటఁగలిసెను. అంతనిర్జరులెల్లఁ బరమేష్ఠికడ కరిగి మొఱపెట్టుకొనిరి. అప్పుడు బ్రహ్మదేవుండు వేల్పులతోఁగూడ నా పర్వత గుహాకడ కరుదెంచెను. త్రిమూర్తులతోఁగూడఁ దనకడకరుదెంచిన సురలనరసి వాయుదేవుండు వారల రాకకు నిమిత్తమడుగుచుఁ బితామహుండా

వాయుమూర్తికి సర్వము నెఱింగించి వేల్పులపై దృష్టినిగుడించి మీరెల్లరీ యాంజనేయునకు వరములిండు. ఇయ్యదివాయు మూర్తికి సంతోషకారణమని నుడివి నా బ్రహ్మాస్త్రబ్రహ్మ దండములీ వాయుసూనునేమియుఁ జేయఁజాలకుండుత మని తాను వరమీయ నంత సదాశివుండును నా త్రిశూలంబును పాశమును పాశుపతాస్త్రాదులు నిమ్మహామహుని బాధింప కుండుఁగాతమని వరమిచ్చెను. ఆపై శ్రీమహావిష్ణువుఁ నా సుద ర్శనమును శార్ఙ్గంబును గామోదకీనందకంబులు నీతని నేమియుఁ జేయఁ జాలకుండుతమని వరమొసంగెను. పదపడి పాకశాస నుండు 'నావజ్రింబుచే వీనిహనువు (చెంప) భగ్నమా యెఁగావున నేటినుండి వీనికి హనుమంతుఁడను పేరొసంగు చున్నాను. ఇఁకమీఁదనీతనికి నావజ్రమువలన నేలాటి బాధయుఁగలుగకుండుఁగాత మని వరంబిచ్చెను. అనంతరము సూర్యుఁడు 'నాలోని తేజశ్శతాంశను నీతనికి నేనొసఁగు చున్నాను. మఱియు నీతఁడు విద్యాగ్రహణయోగ్యుఁడగు తఱి సర్వవిద్యల నేర్పెదననియు వరంబొసంగెను. ఇట్లు వేల్పులెల్లరు నాంజనేయునకు వరములొసంగి తమతమ నెలవులకరుగఁగా వాయుమూర్తియు నస్త్రశస్త్రాదులచే భయములేని నిజనందనుఁజూచి సంతసించి మెప్పటియట్లుతిరిగి వీవఁదొడంగెను. పదపడి యక్కుమారుని దోకొని చని యంజనకిచ్చి వరంబుల సంగతిఁ దెలుప నామెయు నానందాబ్ధి నోలలాడెను. క్రమముగా హనుమంతునకు నాడుకొనునీడు రాఁగా నాతఁడు నిజవరంబులచే గర్వించి మహర్షుల విసిగింప

వారు శాపమీయఁదలంచిరిగాని యాతని వలనఁ గాఁదగిన మహాకార్యముల విచారించి యిట్లుమందలించిరి. 'హనుమంతుఁడా! నీవు మమ్ములఁ జాలవిసిగించితివి గాన శాపమిచ్చుచున్నాము. నిన్నితరులుప్రశంసించుదాఁక నీశక్తి నీకుఁ దెలియకుండుఁగాత'మని.

అదిమొదలు హనుమంతుఁడు సామాన్యవానరమువలె నడిపించిన జడియుచు నుండెను.

## 3. ఆంజనేయుని విద్యాభ్యాసము

అంతఁ గొంతకాలమునకు హనుమంతుఁడు తనకు విద్యాభ్యాసమునకుఁదగిన యీడురాఁగాఁ దల్లివలనఁ జిన్ననాఁటఁదనకు సూర్యుఁడొసంగిన వరమును విని సూర్యభగవానుని సమీపించి వినీతుఁడై యిట్లు విన్నవించెను. 'తేజోనిధీ! భాస్కరా! మీరునాకు యుక్తవయస్సున సమస్త విద్యల నేర్పెదనని నా బాల్యముననాకు వరమిచ్చితిరఁట. ఇది నాకు విద్యాగ్రహణంబునకు యుక్తవయస్సు. దయచేసి యీ విద్యార్థిని గటాక్షించి సర్వవిద్యలననుగ్రహింప మఱి మఱి వేఁడుచున్నాను." నావుడుహనుమానుని వినయ విధేయతాది గుణంబులకు సంతుష్టుఁడై భాస్కరుఁడు 'కుమారా! నేనొక యెడనుండనివాఁడఁగాను. సదా ప్రాక్పశ్చిమాచలంబులకు రాకపోకలు సలుపుచుండుదును. ఒక్కచో నిలుకడలేని నేను నీకెట్లు విద్యలనేర్పఁ గలుగుదునా'యని సంశయించుచుండినన

నాంజనేయుఁ డాదిత్యున కంజలిగావించి "మహాత్మా! ఆసంశయము తమకు వలదు. ఆవీలు నేనే కల్పించుకొందున"ని మనవిచేసి యుదయపర్వతమందొక పాదము నస్తాచలంబుపై నొక పాదంబునిడి యాయహార్వృతి వలన సకల శాస్త్రరహస్యంబులను వినుచు వినిన వెల్లనుధారణచేయుచు నచిరకాలములోనే మహాపండితుఁడాయెను, "కష్టీఫలీ' అనునట్లంతటి కష్టంబునకోరిచి విద్యగడించెను గనుకనే యగస్త్యులు సయితము శ్రీరాములతో హనుమంతునిగూర్చి యిట్లు ప్రశంసించెను.

"గీ॥ కుడిచిచల్లని నీడలఁ గూరుచుండి
గురువుచెప్పినఁ జదువరీధర వడుగులు
నిరశనుండయి పఱచుచు నింగిఁగఱకు
టెండకు సహించి చదివె సీతండుఘనుఁడు.

శ్రీ॥ ఉ॥ రా॥

మ॥ స్థైర్యధైర్యపరాక్రమక్రమ ♦ సాహసంబుల శౌర్యగాం
భీర్యబుద్ధులఁ జాతురీనయ ♦ వీర్యయుక్తులసూక్తి మా
ధుర్యకార్యధురీణతాజన ♦ తుష్టి కారణచర్యలన్
సూర్యశిష్యునకీ ప్రభంజన ♦ సూతికిన్ సములుందురే॥

శ్రీ॥ వా॥ రా॥

గీ॥ 'సూత్రములతోడ వృత్తియు సూత్రములను
నర్థము పదంబు మఱియు మహార్థమన్య
శాస్త్ర నిచయంబు ఛందస్సుఁ జక్కనేర్చెఁ
గీర్తిత చరిత్రుఁడీతండు కేవలుండె?'

శ్రీ॥ వా॥ రా॥

సీ॥ జగములనుముంపఁబూనిన సాగరుండు
భువనముల గాల్పఁబూనినభవుఁడు
ప్రళయవేళను రేఁగుచున్నై వశ్వతుండు
వాయుజుఁడు వానియెదుట నేవ్వాఁడునిల్చు
శ్రీ॥ వా॥ రా॥

ఇట్లు పెద్దల యభినందనంబులకుఁ బాత్రుండై సమస్త విద్యాపారంగతుండై శ్రీహనుమంతుఁడు సూర్యానుజ్ఞాతుండై జనయిత్రియగు నంజనాదేవి సమీపంబునకుఁజనియె.

## 4. హనుమంతుండు సుగ్రీవునకు మంత్రియగుట

హనుమంతుఁడట్లు తల్లి సమీపమేగి జననీ! నాకుఁ గర్తవ్యమాజ్ఞాపింపుమని వేడనాయమహానముతో వాయు మూర్తిఁ బ్రార్థింప నయ్యనిలుండు ప్రత్యక్షమై "యోహను మంతుండా! నీవుసమస్త విద్యలఁజక్కగా నేర్చితివి నినుఁ బోలురాజకార్యధురంధరుండు లేఁడనునట్లు నీవు కిష్కింధా రాజానుజుండగు సుగ్రీవునకుమంత్రివై యతనిగృతార్థునొనర్చుము కతిపయ కాలంబునకు నారాయణావతారుండగు శ్రీరామునితో నీతేనికి నీకారణముగాఁ జెలిమివాటిల్లును నీవారామభద్రునినిగొలిచి తరింపఁగలవ,"ని నుడివెను.

హనుమానుఁడా వాక్యముల నాలించి భగవదవతార భూతుఁడగు శ్రీరాముదర్శనమబ్బునను సంతసముతో సుగ్రీవునికి సచివుఁడాయెను.

ఒకనాఁడు కిష్కింధారాజును, నిజాగ్రజుండునగు వాలి దుందుభియనురక్కసునితోఁ బోరాడుచుండ సుగ్రీవుండువిజయ ఫలితంబుఁజూచుచుండెను.

పరస్పర జయకాంక్షులై వాలి దుందుభులట్లు కొంత సేపు పోరాడ దుందుభి వాలిశక్తికి తాళలేక యొక కొండగుహలో డాగెను. వాలియు దుందుభిని దుదముట్టించు తలంపుతో వెనువెంట యాగుహలోనికరిగెను. సుగ్రీవుఁడు మాత్రము గుహాద్వారమునొద్దనేయుండెను. చాలకాలమువఱకు వాలి రాకుంటయు గుహానుండిరక్తధారలుకాలువలై ప్రవహించుట యుఁజూచి సుగ్రీవుండుతనయన్నను, దుందుభియంతమొందించెనని యెంచి తనను గూడఁజంపునను వెఱపుచేగుహాద్వారంబు నొక్కపెనుబండచేమూసి కిష్కింధకేగి వానరులకావార్త నెఱింగించి రాజ్యమరాజకము గాకుండఁ దానేరాజయ్యెను.

అంతఁగొంతకాలమునకు వాలి దుందుభిఁ దెగటార్చి గుహాద్వారంబునందలిబండ నొక్క తన్నుతోఁదొలఁగఁద్రోసి కొనిబయటికివచ్చెను. మఱియుదుందుభిశవంబునీడ్చి దూరము గాఁబాఱవైవనందలి రక్తబిందువులు ఋశ్యమూకంబునఁదప మొనర్చుచున్న మతంగమహర్షియాశ్రమంబుపైఁబడ నమ్మహర్షికోపించి "యోయీమదాంధా! వాలీ! రక్తబిందువులచే మదాశ్రమంబు మలినమొనర్చితివిగాన నీవీపర్వతంబునకు

వచ్చిన చోఁజచ్చెదవుగాక" యనిశాపమిచ్చెను. అదియెఱింగి వాలినాఁటినుండియు నాఋశ్యమూకంబునకరుగఁడు.

తరువాత వాలి కిష్కింధఁజేరి తనతమ్ముని యకృత్యమునకుఁగినిసి యాతని పలుపోకల బాధించుటయే గాక భార్యనపహరించి రాజ్యంబునుండి తఱిమివేశెను.

హనుమంతుఁడు తనఱేఁడగు సుగ్రీవునకుఁగల్గిన పరాభవంబునకుఁజింతించి వాలివధింప శక్తుండయ్యుఁదనబలంబు తానెఱుంగనివాఁడగుటచే నేమియుఁజేయజాలక సుగ్రీవుండు సుఖంబుగానుండుటకు వాలి దుష్ప్రాపమగు ఋశ్యమూకంబుఁ జేర్చియట సుగ్రీవాభ్యుదయసమయంబున కెదురుచూచుచుండెను.

## శ్రీ మహావిష్ణువు రాముఁడగుట

"శ్లో॥ కోసలో నామముదితః
స్ఫీతో జనపదో మహాన్
నివిష్టః సరయూతీరే
ప్రభూత ధనధాన్యవాన్

శ్లో॥ అయోధ్యానామ నగరీ
తత్రాసీల్లోక విశ్రుతా
మనునామానవేంద్రేణ
యాపురీ నిర్మితాస్వయమ్

శ్లో॥ యథామనుర్మహాతేజా
లోకస్యపరిరక్షితా
తథాదశరథో రాజా
వసన్ జగదపాలయత్” శ్రీ॥ రా॥

తత్రాదృశమగు నయోధ్యానగరంబునిందు సమానుండగు దశరథుండేలుచుండెను. ఆతఁడు పెక్కేండ్లు పుత్రులు లేక పుత్రకామేష్టినొనర్చెను. అప్పుడు శ్రీహరి జగద్రక్షణార్థము శ్రీరాముఁడుగాఁ గౌసల్యయందును, చక్రము భరతుఁడుగాఁ గైకయందును, శేషుండు శంఖమును లక్ష్మణశత్రుఘ్నులుగా సుమిత్రియందునుదయించిరి. కాలక్రమముగా వారు సమస్త విద్యల నభ్యసించి విశ్వామిత్రునితోఁగూడ జనకు జన్నంబుఁ గన్నులారఁ గాంచనరిగిరి. అచ్చట రామభద్రుఁడు శివధనుస్సు విఱిచి సీతను బెండ్లియాడెను, లక్ష్మణుఁ డూర్మిళాదేవిని భరతశత్రుఘ్నులు మాండవీశ్రుతకీర్తులను గూడఁ బరిణయమైరి. పదంపడి పరిణీతులగు సుతులతోఁగూడ దశరథుఁడు సుఖముగా సాకేతముఁజేరి శ్రీరామునకుఁ బట్టముగట్టఁ దలపోసెను. కాని మంథర దుర్బోధచేఁ గైక సమయముఁజూచి పతితో నిట్లనెను. ‘మహారాజా! నీవుసత్యవ్రతుండవేయైనచో పూర్వము నాకొసంగిన రెండువరముల నిప్పుడే యొసంగవలయును. వానిలో మొదటివరంబునకు శ్రీరాముని నేఁడు మొదలు పదునాల్గు సంవత్సరములు వనములో నివసింపఁ జేయుము, రెండవ వరమునకు భరతపుత్రుని సింహాసనాసీనుఁ

గావింప వలయును' అపల్కు-లు ముల్కు-లవలెఁ జెవినాఁట విదారంపడి దశరథుఁడతి దుఃఖముతో రామునడవికి బంపెను. ఆదుఃఖముచేతనే యచిరకాలముననే మహారాజుగారు కాలధర్మమందిరి. నాఁడు శ్రీరాముఁడరణ్యమున కేగునపుడు 'శశినాసహాయాతికౌముదీ' అన్నట్లు సీతయు దన ప్రాణేశు ననుగమించెను. సౌభ్రాత్రముచే లక్ష్మణుఁడుగూడ రాముని బాయలేక వెంటనంటెను. భరతుఁడుగూడ నయోధ్య లేఁడు. అంత మేనమామయూరినుండి భరతుఁడరుదెంచి శ్రీరాముఁ డడవికేగినందులకు దుఃఖించి తండ్రికిఁ బరలోకక్రియలొనర్చి రామచంద్రుఁడు చిత్రకూటమునందున్నాఁడని తెలిసి యటకేగి యన్న పాదంబులపైఁబడి మరల నయోధ్యకరుదెంచి రాజ్యము గైకొమ్మని ప్రార్థించెను. కాని రాముఁడంగీకరింపక భరతుని ప్రార్థనమీఁద నిజ పాదుకలమాత్ర మొసంగెను. భరతుఁడు వానికే పట్టాభిషేక మొనర్చి స్వభాతృభక్తిని లోకమునకు వెల్లడించెను.

పదపడి శ్రీరాముఁడు జనస్థానమను పంచవటీ ప్రదేశంబునఁ గతిపయకాలము నివసించెను అచ్చట ఖరదూష ణాదులు పదునాల్గువేల రక్కసులు మడయుటయు శూర్పణఖ పరాభవము గాంచుటయు విని లంకేశ్వరుఁడగు రావణుఁడు

శ్లో॥ "తతో రామస్యతచ్ఛౌర్యం
నిశమ్య దశకంధరః

జహారజానకీం సాధ్వీం
మాయయా సత్వరంభయాత్" పు.

ఆవిధముగా లోకమాతయగు సీతను దొంగిలించుకొని వెళ్ళఁగనే మారీచు వధించి వచ్చుచున్న శ్రీరాములతో మధ్యే మార్గముననే సౌమిత్రితో కలసి తిరిగి యాశ్రమమరుదెంచి యందు భూనందనఁగానక చాలతడవు వెదకి సీత కన్పడమిచే దిగులొందిరి. తరువాత నరణ్యమంతయు నన్వేషించుచు జటాయువను గృధ్రమువలన రావణకృత సీతాహరణోదంతమును, శబరివలన సుగ్రీవ వృత్తాంతమును విని సుగ్రీవునితో స్నేహమొనర్ప నెంచిరి. అందులకై రామ లక్ష్మణులు ఋశ్యమూక పర్వతప్రాంతమున నున్న పంపాసరస్సునకు వెళ్ళిరి.

## 6 శ్రీరాముఁడు సుగ్రీవుఁడును మిత్రులగుట

ఋశ్యమూకముపైనున్న సుగ్రీవుఁడు శ్రీరామ లక్ష్మణులఁ జూచి భీతుఁడాయెను. మఱియు వారు వాలిచేఁ బంపఁబడినవారని తలఁచియుద్వేగమును బొందెను.

" శ్లో॥ ఉద్విగ్నహృదయః సర్వా
దిశః సమవలోకయన్
నవ్యతిష్ఠత కస్మింశ్చి
ద్దేశేవానరపుంగవః " శ్రీ॥ రా॥

అట్లు సుగ్రీవుఁడు భయ భ్రాంతుఁడగుట నెఱింగి యాంజనేయుండు సుగ్రీవా! నీవెంత చేలవు స్వజాతి చాపల్యముఁ జూపించుచున్నావు. ఆమహాపురుషుల ముఖ లక్షణములఁజూడుము. వారు నిర్దోషులు కాఁబట్టి నీ వేలాటి జంకును గొనక నీ మంత్రులలో నొక్కరిని వారి వృత్తాంతమరసిరాఁ దత్క్షణమే పంపుమనెను. అదివిని సుగ్రీవుఁడు నీవేయకార్యమున కర్హుండవు అన 'వల్లె' యని మారుతి యతి వేషముతో వారియొద్దకు వెడలెను. వారినిజూచి వాక్యజ్ఞుఁడగు వాయునందనుఁడిట్లనెను. మహాశయులారా! మీరెవరు? ఈ నిర్జనారణ్యంబున కరుదేరఁగారణమేమి? దేవతా సమానులయ్యు నేల కాననంబునఁ గ్రుమ్మరుచున్నారు. మీరు భూమండలమంతయుఁ బాలింప యోగ్యులు" ఇట్లు చెప్పినప్పటికి వారు మౌనముతోనున్నందున మఱియు హనుమంతుఁడిట్లనియెను.

సుగ్రీవుఁడను వానరరాజున్నాఁడు ఆతఁడు ధర్మాత్ముఁడు, పరాక్రమశాలి. జ్యేష్ఠభ్రాతచే వంచితుఁడై యీఋశ్యమూకమున నున్నాడు. నేనా మహాత్మునకు సచివుఁడను. పవనాత్మజుఁడను. నాపేరు హనుమతుఁడందురు. అతని హితంబుఁ బొంటెయతినై యిటకరుదెంచితిని ఇదివిని శ్రీరాముఁడు ప్రక్కనున్న లక్ష్మణునితో ఇట్లనెను. లక్ష్మణా! ఈ మహాపండితుని వాక్యముల నాలకించితివా?

శ్లో॥ నానృగ్వేదవినీతస్య
నాయజుర్వేదధారిణః

నా సామవేద విదుషః
శక్యమేవం ప్రభాషితుమ్.

శ్లో॥ నూనం వ్యాకరణం కృత్స్న
మనేన బహుధా శ్రుతమ్
బహువ్యాహరతానేన
నకించిదపశబ్దితమ్.

శ్లో॥ నముఖే నేత్రయోర్వాపి
లలాటే చ భ్రువో స్తథా
అన్యేష్వపిచగాత్రేషు
దోషః సం విదితః క్వచిత్.

శ్లో॥ అవిస్తరమ సందిగ్ధ
మవిలంబిత మద్రుతమ్
ఉరస్థం కంఠగం వాక్యం
వర్తతేమధ్యమేస్వరే.

శ్లో॥ సంస్కార క్రమసంపన్నా
మద్రుతా మవిలంబితామ్
ఉచ్చారయతి కల్యాణీం
వాచం హృదయహారిణీమ్.

శ్రీ॥ వా॥ రా॥

ఇట్లతిమనోహరంబులై వేదరహస్య గర్భితములై నిర్దుష్టములుగా నలరారుచున్నవి. ఈ వానరోత్తమునకుఁ బ్రత్యుత్తరమిమ్మని లక్ష్మణుండు సుగ్రీవసచివుతో నిట్లనియె.

లక్ష్మణుఁడు___పండితోత్తమా ! మీ వాక్యంబులకు సంతుష్టుల మైతిమి. మేమును మీ సుగ్రీవునిగూర్చి వినియే యాతని దర్శింప నిటకే తెంచుచున్నారము. అతని తోడి నెయ్యము మాకెంతేయుఁ బ్రీతిజనకము.

హనుమంతుఁడు___మహాత్మా ! మీరెవరు ? మీ పేరేమి.

లక్ష్మణుఁడు___మేము దశరథాత్మజులము ఈ మహాపురుషుని శ్రీరాముఁడందురు. నేను లక్ష్మణుఁడను.

ఇవ్విధముగా సౌమిత్రి హనుమంతున కెల్లసంగతులఁ దెల్ల మొనర్చి మఱియు నిట్లనియె ఓ వానరోత్తమా !

ఉ॥ మానిత సర్వసద్గుణ సమంచితులే ధరణీవరాగ్రణుల్
మానుగ లేనిచేతి బహుమానము గౌరవమందుచుండిరా
దానవరేణ్యుఁడా దశరథప్రభుపుత్త్రుఁడు లోకవిశ్రుతుం
డీనయశీలుఁడిప్పుడు కపీశ్వరులే శరణంబుఁజొచ్చెడిన్.

శ్రీ. వా. రా.

అని కన్నీరు విడిచెను.

అదిగని హనుమంతుఁడు లక్ష్మణునూరార్చి వారికి వాలి సుగ్రీవవైమనస్యాదుల నెఱింగించి మహానుభావులారా! మీరు దుఃఖితులు, సుగ్రీవుఁడును బ్రస్తుతము దుఃఖితుఁడు. మీరు సమానదుఃఖులరగుటచే మీకుఁ బరస్పరము నెయ్యము నంఘటిల్లును. కాన నవశ్యము మీరా వానరేంద్రుఁడగు సుగ్రీవుతో సఖ్య మొనర్చుకొనుఁడు. అని యందుల కవ్వారి యంగీకార మెఱింగి వారిని ఋశ్యమూకమునకుఁ గొనిపోయి

సుగ్రీవునితో రామలక్ష్మణులకుఁ బరిచయముఁ గలిగించి యచ్చట నగ్నిసాక్షికముగా నవ్వారికి స్నేహము చేయించెను.

## 7. వాలివధ

శ్రీరామసుగ్రీవులు మైత్రిచేసికొనిన తర్వాత రాముఁడు బలశాలియగు వాలి నొక్కమ్మునఁ గూలనేసెను. సుగ్రీవునకుఁ బట్టాభిషేక మొనర్చెను. అప్పుడు వర్షాకాలమగుటచే శ్రీరాముఁడు సుగ్రీవునితో.

"సుగ్రీవా! ఇది వర్షాకాలము. ఇది యుద్ధయాత్ర కనుచితము నీవు వెళ్ళి రాజ్య మొనర్చుచుండుము. శరత్కాల మరుదెంచుతోడనే వానర సేనలఁగొనిరమ్ము నేను నా సోదరునితోఁగూడ నీ ఋశ్యమూకమునందే యుందును" అనియెను. తరువాత వర్షాకాలము గడచెను. సుగ్రీవుఁడు కామ సుఖోన్మత్తుఁడై శ్రీరామునిమాట మఱచెను. అప్పుడు బుద్ధిశాలియగు మారుతి సుగ్రీవు సన్నిధికేగి సుగ్రీవా! ఇది యేమి? శ్రీరాముఁడు వాలినిజంపి నీకు రాజ్యమిప్పించెనను సంగతిమఱచితివా? అయ్యో! ఉపకార మొనర్చినవానిని మఱచితివే? ఇదినీకుఁదగదు అనెను. ఆమాటల విన్నతోడనే సుగ్రీవుఁడు త్వరగా వానర సేనల సమకూర్చుకొని శ్రీరాముని దగ్గఱకు వెళ్లి ప్రణతుఁడై "రామచంద్రా! ఇవిగో వానర సేనలు మీ యధీనమొనర్చుచున్నాను" అనెను. అదివిని శ్రీరాముఁడు "ఓయీ నీవే యీసైనికుల సీతాన్వేషణ కృత్యమున నియోగింపు" మన 'వల్లె' యని సుగ్రీవుఁడు వినతాది వానరవీరులను దూర్పునకును, సుషేణాదులను బశ్చి

ముంబునకును, శతవాల్యాదుల నుత్తరమునకును హనుమదాది వానర ప్రముఖుల దక్షిణంబునకును నియమించెను. అంత శ్రీరాముఁడు హనుమంతుని బుద్ధిచాతుర్యము గ్రహించి యాతనితో "ఓయీ! మారుతీ! నీవే సీతాన్వేషణమున కర్హుండ వని తలంచుచున్నాను. నీకీముద్రిక నిత్తును దీనిని సీతకభిజ్ఞానముగానిమ్ము" అనెను అని యంగుళీయకము నాంజనేయున కొసంగెను.

## 8. హనుమంతుఁడు సముద్రమును లంఘించుట.

అపుడు వానరవీరులెల్లరుఁ దమతమ నియమిత దిక్కులకుఁ బ్రయాణమైరి. ఆంజనేయుఁడును అంగద జాంబవదాదులతో దక్షిణమునకుఁబోయెను. అచ్చట వారు వింధ్యాది పర్వతములందును తద్గుహాలయందును దరు మూలంబులందును వనంబులందును జానకిని వెదకి వెదకి యెందును గానక విసిగిరి. సుగ్రీవ నిర్దిష్టకాలమాసన్నమగుటచే వారు దిగులొంది ప్రాయోపవేశమునకు నిశ్చయించుకొని దర్భలు పఱచుకొనిరి. అంతలో సంపాతియను గృధ్రరాజమువలన సీత లంకలో నున్నట్లు తెలిసికొనిరి గాని నడుమ శతయోజన విస్తీర్ణమగు సముద్రమంతరాయమగుటచే నిరుత్సాహులైరి. అపుడా కపులలో నొకఁడు పదియోజనములు దూకఁగలననియె, మఱియొకఁడు నేను నలుబది యోజనము లవలీలగా దూకుదుననెను. వేఱొకఁడు మఱికొంతదవ్వుదూక నాకుశక్తికలదనియుఁ జెప్ప

సాగిరి. కాని హనుమ తనబలంబు తా నెఱుంగఁడు గాన నేమి యుమాటాడకుండెను. అప్పుడు జాంబవంతుఁడను నొక భల్లూకేశ్వరుఁడు మారుతి సామర్థ్యమెఱింగిన వాఁడగుటచే నాతని ప్రశంసించి హనుమంతుని బలమతనికెఱుకపఱచి సముద్రోల్లంఘనమునకుఁ బ్రోత్సహింప మారుతి యుప్పొంగి యో శాఖామృగేంద్రములారా ! నేను మీ చెప్పినట్లుచేయ సమర్థుఁడను. అని చెప్పి మహేంద్రపర్వతమెక్కి గగనంబున కెగుర నుద్యుక్తుఁ డాయెను. మఱియు

క॥ తెచ్చెద లంకనిచటికిం
 ద్రొచ్చెద రావణునిబట్టి క్రూరతమై నే
 వచ్చెద సెలవిచ్చెదరే
 హెచ్చెదఁ గృతకృత్యతను గపీశ్వరులారా.

హ॥ చ॥

ఇట్లు పల్కి గగనమార్గమున కెగసి సముద్రముదాఁటుచుండెను. అప్పుడు స్వర్గమర్త్య పాతాళములనుండి యెల్లరుఁ జూచుచుండిరి, దేవతలు హనుమంతుని బరీక్షించుటకును, ఆయన బలంబు నెఱుంగుటకును 'సురస' యను నాగమాతను బంపిరి. ఆమెయు భయంకరాకారయై దారికడ్డముగానుండి మారుతిం జూచి 'ఓయీ! ఎక్కడికి వెళ్ళెదవు? దేవతలు నిన్ను నాకాహారముగా నుపయోగించిరి; అన మారుతి 'తల్లీ! ఇప్పుడు రామకార్యార్థ మేగుచున్నాను మరలవచ్చి సీతవార్త శ్రీరామున కెఱింగించి నీ కాహారమగుదును, లేనిచో శ్రీరాముని కార్యమున కాలస్యమగును, అని యెంతచెప్పినను సురస వినక

హనుమంతుని మ్రింగ నావనము పెంచసాగెను. అదిగని మారుతి దానిని జంపఁదలఁచక మెనుబది యామడల వైశాల్యముగల దాని నోటినిజూచి యంగుష్ఠమాత్రకాయుఁడై వాని ముఖంబుజొచ్చి మరల బహిర్గతుండై 'సురసా!' దేవతల వచనపరికారము నీ నోరఁజొచ్చి నీకాహారమైతినిగాన నికఁ బోవుచున్నానన సురసయు సంతసించి

క॥ పోమ్మా హనుమ! యథా సౌ
ఖ్యమ్ముగ నీకెల్ల పనులుఁ గడుసుకరములౌ
నిమ్ముగ రాముని ముద్దుం
గుమ్మను బతితోడ వేగకూర్పుము వత్సా!

హ॥ చ॥

అని దీవించి దేవలోకమునకు వెళ్లెను.

అంత నాంజనేయుఁడు మార్గశేషము గమించుచుఁ దన్ను సన్మానింపనెంచు మైనాకు నభినందించి గరుడానిల వేగముతో వెళ్లుచుండ సింహికయను ఛాయామృగమాయన నడ్డగించెను గాని మారుతి దానిని దక్షిణమున ద్రుంచి బృందారకుల యభినందనములతో మున్నీటికావలి దరినున్న లంకాపురి పొలిమేరఁ జేరెను.

## 9 మారుతియక్షయకుమారునిజంపుట

అపుడే సూర్యుఁడస్తమించుచుండెను. హనుమ యంత వఱకు వేచియుండి పురద్వారముననున్న లంకాధి దేవత యగు లంకిణిని మర్దించి లోనకేఁగెను. అక్కడ మారుతి రావ

ణాంతఃపురమునను బుష్పకవిమానమందును మఱియు నితర
రాక్షస గృహములందును సీతను వెదకి యెందును గానక
వేసారి యశోకవనంబున నుండునేమోయని యటకేగి యం
దొక వృక్షంబుక్రింద మలినాంబరధారిణియై రామనామ
స్మరణ మొనర్చుచుఁ గన్నీరు మున్నీరుగాఁ గార్చు నొక్క చెలు
వంగని యీయమయే సీతగానోపునని యెవ్వరికిఁ గానరాకుండ
నావృక్షమధిరోహించి జానకికిఁ గావలిగానున్న వికారాకార
లగు రాక్షసాంగనల నవలోకించి వారి రూక్షోక్తుల వినుచుం
డెను. అంతవారు నిద్రించుటయు నవకాశముగాఁగొని మెల్లఁ
గాఁగ్రిందికరుదెంచి జగన్మాతయగు సీతకుఁ బ్రణమిల్లి తాను
రామ దూతనగుటయు రామలక్ష్మణులు ఋశ్యమూకమున
నుండి సీతాన్వేషణమునకుఁ దన్ను నంపుటయు మున్నగు విష
యంబుల సీతకెఱుకపఱచి రాముఁడొసఁగిన యంగుళీయకము
నభిజ్ఞానముగా నొసఁగిన జానకి యతని యంతయు విశ్వసించి
తన కష్టముల హనుమకు నివేదింప నావానర వీరుండు తల్లీ!
నీకష్టములు గట్టెక్కు కాలమరుదెంచెనని ధైర్యముచెప్పి తన
విశ్వరూపమాయమకుఁ గనఁజేసి యూఱడించి నేను నిన్నుఁ
గనినట్లు శ్రీరాముఁడు విశ్వసింప నభిజ్ఞానమేమైన నిత్తువాయన
నాతల్లి చూడామణి యొసఁగ నదిగైకొని జానకికిఁ గృతాంజ
లియై సెలవుగొని తనలో నిట్లు తలపోసికొనెను.

'సీత నవలోకించితినని శ్రీరామున కెఱిఁగించినచో
నమ్మహావీరుండు రక్కసుల బలాబలంబులు వక్కాణింపుమన
నేనేమి చెప్పుదును. కాన నీ వనంబును భగ్నంబుగావించి

నచో రాక్షసు లవశ్యము యుద్ధమునకు రాఁగలరు. వారితోఁ బోరాడి వారి బలంబు నెఱుఁగుదుఁగాక యని యక్కార్యము నకుపక్రమింపఁ జూచుచుండెను.

ఆహా! ఏమీ హనుమానుని ధైర్యసాహసములు.

తరువాత నాంజనేయుండశోకవనమును భగ్నముగావింప నందలి కావలివారా మారుతితోఁ బోరాడి మడసిరి. హతా వశిష్టులు రావణునితో నీవార్త విన్నవింప నాతఁడా వానరుఁ బోకార్ప నెనుబది వేల రక్కసులఁ బంపెను. వెంటనే యాదంట యాతుంటరులు తనపైవచ్చుటెఱింగి యవ్వనంబునఁ బ్రాఁతి యున్న యాయసంబగు ధ్వజస్తంభంబుఁ బెకలించి యద్దానితో వ్రేటునకు వేయిమంది చొప్పున నద్దనుజ వీరులఁ దునుమాడెను. రావణుఁడదివిని ప్రహస్త మంత్రి పుత్త్రుండగు జంబుమాలిని సైన్యసమేతముగాఁ బంప నాతండును హనుమంతునిచే హతుఁడాయెను. అంత దశకంఠుఁడకుంఠ పరాక్రమమగు మంత్రిపుత్త్రసప్తకముఁ బంప వారును హనుమ ద్ప్రతాపాగ్ని కాహుతులైరి. అదివిని దశాస్యుఁడు క్రోధతామ్రాక్షుఁడై యక్కపివీరునంతకాతిథిఁజేసి రండని విరూపాక్ష, యూపాక్ష, భాసకర్ణ, ప్రఘస, దుర్ధరులను సేనాధిపతులఁ బనుప నవ్వానరేంద్రు నెదుర్కొనఁజాలక యాలంబున నేలఁ గూలిరి. అప్పుడు రావణుఁడదిగాదని తన ముద్దుఁగొమరుండగు మహావీరుఁడైన యక్షకుమారు ససైన్యంబుగా మారుతిఁ జంపఁబంప నక్కుమారుండు హనుమతో నెదిరి ఘోరయుద్ధ మొనర్చెను. ఆ మహావీరులిరువురుఁ బోరాడుచుండ భూమి

యదిరెను. కొండలు చెదిరెను. చూచువారికి గుండెలు గుభాలుమనుచుండెను. దేవతలు హాహాకారము సేయుచుండిరి. అట్టియెడ హనుమదిట్టతనంబున నా రక్కసిపట్టిబట్టి పాలార్చి మెలఁకువతో వాని యసుగుల నొడిసిపట్టి గిరగిరఁ ద్రిప్పి నేలఁగొట్టి విగతాసుఁ జేసెను. వేల్పులు విరివానఁ గురిసిరి. జగమానందాబ్ధిఁదేలెను. బృందారక బృందంబులా యాశ్చర్యంబుఁగను గొనుచు నమ్మహావీరుని

శ్లో॥ అంజనానందనం వీరం
జానకీ శోకనాశనమ్
కపీశమక్ష హంతారం
వందేలంకాభయంకరమ్. వా. రా.

అని స్తుతించిరి.

## హనుమంతుఁడు రావణునితో మాటాడుట

అంత దశకంఠుఁడు ముద్దుపట్టియగు నక్షకుమారుఁడు మృతి జెందుటయు విని కడుంగడు దుఃఖితుఁడై తన జ్యేష్ఠ కుమారుండును ఇంద్రజేతయునగు మేఘనాదు నవ్వానరేంద్రుఁ బ్రనుంప నంప నాతండును రాక్షససేనలతో హనుమంతు నెదుర్కొని పోరి లావుతఱిగి ప్రాణభయంబుచే బ్రహ్మాస్త్రము వేయ నమ్మారుతి యాయస్త్రము తన్నేమియుఁ జేయఁజాలదని యెఱింగియు రావణునకు హితోపదేశంబు గావించు నుద్దేశంబుతో నయ్యస్త్రంబునకు గౌరవంబిచ్చు వాఁడునుం బోలెఁ గట్టువడినట్లు నిశ్చేష్టుఁడై యుండెను. అప్పు డింద్రజిత్తు

కుతుకమ్మతో నా వానరేంద్రుని స్యందనంబున నిడుకొని రావణు సమ్ముఖమ్మున నిలుప నున్నత సింహాసనాసీనుం డగు రావణు నాలోకించి యక్షవీంద్రుండును నిజవాలంబు నేతదాస నంబుకన్న నున్నతాసనంబుగ నమర్చుకొని యం దుపవిష్టుండై యుండ రావణుండు ప్రహస్తమంత్రితో నీ వానరవృత్త మారయు మనఁ బ్రహస్తుఁడు హనుమంతునితో నిట్లనియె. ఓయీ! నీ వెవఁడవు. నీ యజమానుఁ డెవ్వఁడు. అశోకవన మేల్లచెఱచితివి. రక్కసుల నుక్కాఁడఁ గత మేమి? నిజమాడు లేదా నీప్రాణములు నీవికావని తర్జింప నాంజనేయుఁ డతని నరకుసేయక రావణువలనై యిట్లనియె. ఓ రాక్షసేంద్రా! వినుము. నే నొక వానరమను. నా పేరు హనుమంతుఁ డందురు. పవననందనుఁడను. నీవే వరములఁ బొందితివని గర్వింపకుము. నేనును నీకన్న మిన్నగనే వరములఁ బొంది యున్నాను. నన్ను బ్రహ్మాస్త్రముసైత మేమియుఁ జేయఁ జాలదు. నిన్నుఁ జూడవలయు ననియే యీ యస్త్రమునకుఁ గట్టువడినట్లుంటిని. ఇఁక నావృత్త మాలింపుము. కోసలదేశ మునఁ బరాక్రమవంతుఁడగు దశరథుఁడను రాజుండెను. ఆయ నకు నల్వురు పుత్త్రిలు గలరు. వారిలో జ్యేష్ఠుఁడగు శ్రీరా ముఁడు భార్యయగు సీతతోను సోదరుఁడగు లక్ష్మణునితోను గారణాంతరమున వనవాస మొనర్చుచుండెను. వారు దండకా రణ్యములో నుండగా మగవారు లేని సమయమున నెవఁడో దొంగ సీత నపహరించెను. తరువాత రామలక్ష్మణులు సీతను వెదకుచు వచ్చి సుగ్రీవునితో మైత్రి చేసికొనిరి. సుగ్రీ

వుఁడు వారికి సాయము చేయుటకై పెక్కుమంది వానర వీరుల సీతాన్వేషణార్థ మంపెను. వారిలో నే నొకరుఁడ. సీత కొఱకే నిచ్చోటికి వచ్చితిని, నీయశోకవనమున సీతను గనుగొంటిని. ఇందలి ఫలంబులఁ గొన్నింట నారగించితిని. జాతి స్వభావముచేఁ గొన్ని వృక్షముల భగ్న మొనర్చితిని. నాతోఁ బోరఁ జనుదెంచిన నీ కుమారుని దదితరులగు రక్కసులను జక్కాడితిని. నిన్నుఁ జూచి కొన్నిమాటలు చెప్పుటకే యీ యస్త్రంబునకుఁ గట్టువడినవానివలె నిట కేతెంచితిని. దశగ్రీవా! నిన్ను బందిగాఁ జేసికొనిన కార్తవీర్యార్జును నెఱుఁగుదువు గదా ? వానిని జంపిన పరశురాముఁడు నీ చెవిఁబడియుండవచ్చును. మా శ్రీరాముఁ డాపరశురాము జయించిన ప్రౌఢ యని తెలియుము. అంతియ కాదు. నిన్నుఁ జంకనిడుకొని సప్తసముద్రములఁ దానమాడించిన వాలి నెఱుంగవే? అవ్వాలిని మా రాముఁ డొక్కమ్మునఁ గూలనేసె. అట్టి శ్రీరాము సర్థాంగి నపహరించి నీవు బ్రతుకఁదలఁచితివా? వృథా వంశనాశమునకుఁ గడంగక యయమ్మ నమ్మహాత్మున కిమ్ము. సుఖముగా మనుము. శ్రీరామున కెనుఁరై నీ కెవ్వరును దోడ్పడఁజాలరు. రామున కాగ్రహ మేతెంచిన హరిహరాదులు సైతము గడగడ లాడుదురు. నీవొక్క లెక్క గాదు. శ్రీరాముఁడు సుగ్రీవు సన్నిధి నిన్నుఁ దానే పరిమార్తునని ప్రతిన చేయుటచే నిన్ను విడిచితిని గాని లేనిచో సీతాద్రోహివగు నిన్నిప్పుడే వధించి యుండెడివాఁడ నని నిర్భయం

బుగాఁ మారుతి పలికెను. ఔరా! ఏమీ యాయాంజనేయుని వాక్పటుత్వము. నిర్భీకత్వము.

## 11 హనుమంతుఁడు లంకనుగాల్చుట శ్రీరామునకుఁ జూడామణి నొసంగుట.

అట్లు నిర్భయంబుగాఁ బలికిన యాంజనేయుని చూచి రావణుఁడు చంప నాజ్ఞాపించి చిన్నతమ్ముఁడగు విభీషణుని బోధచే వాల దహనం బొనర్పుఁడని మగుడ శాసింప రక్కసులు తైలార్ద్ర వస్త్రంబు లవ్వానరు వాలంబునకుఁ జుట్టి యగ్గి ముట్టించిరి. హనుమంతుఁడు శాంతంబుగా నూరకుండెను. సీతాప్రభావంబుచే నీయగ్ని హనుమకుఁ దాప మొదవింప లేదు. అంత దానవులా హనుమంతుని శకటారూఢుఁ గావించి యూరేగించుచు "వీఁడె యశోకవన భంజకుఁడ"ని చాటిరి. అదే యదనుగాఁ గొని యా వానరేంద్రుఁడు దైత్యులఁ దునుముచు సూక్ష్మరూపుఁడై మేని కట్లఁ బాపికొని మగుడ దీర్ఘకాయుండై లంకాదహన మొనర్పనెంచి

కం॥ శంపాయుత తోయద మనఁ
గంపింపక హనుమ లంకఁ గల యిల్లిల్లున్
దెంపునఁ జొచ్చుచు దాహన
లంపటుఁడై తిరిగెఁ దోఁటలన్ సౌధములన్.

శ్రీ॥ వా॥ రా॥

ఇట్లు ప్రహస్త మహాపార్శ్వ, వ్రజనాభ, శుక, సారణ, రావణ జంబుమాలి, రశ్మికేత, హ్రస్వకర్ణేంద్రజి, త్కుంభ, నికుంభ, విద్యుజ్జిహ్వ. కుంభకర్ణాక్షకుమార, శోణితాక్షాది రాక్షస గృహంబుల నిప్పు ముట్టించి యెదురై పోరాడువారి నాశన మొనర్చుచుండె నప్పుడు

సీ॥ మండెడు నిండ్లకై కముపు
మండఁగఁ బర్విడివచ్చి వేఁడిమిన్
దండను జేరలేక మసి
నాశనమయ్యెడువిత్తముల్ గనన్.
గుండెలు బ్రద్దలైనను ది
గుల్ గొని యేడ్చెడువారు హా యటం
చుండెడివారు మొత్తుకొను
చుండెడివారు భ్రమించువారుగన్.

శ్రీ॥ వా॥ రా॥

From gate to gate, from court to spire
Proud darken was a blaze of fire.

ఇట్లు లంకాపుర రాక్షసులుండిరి. అట రావణాదుల సౌధములపై సుందర విమానములు కాలి క్రిందఁ బడుచుండెను. మీఁద బడునేమోయను భయముచే నా యగ్ని నెవ్వరును ఆర్పరైరి. ఇట్లు హనుమ లంకాదహన మొనర్చి తోఁక నార్పుకొని సీతకడ సెలవుగొని మున్నీటి యావలి యొడ్డుచేరెను. అట వానరులును సంతుష్టాంతరంగులై యంగదు ననుమతింగొని మధువనంబున ఫలంబులందిని తేనెలం

ద్రావి శ్రీరాముని కడ కేగిరి ఆంజనేయుఁడు శ్రీరామునితో సీతాదేవిని గనుఁగొంటినని చెప్పి చూడామణినిచ్చి నమస్కరించెను.

## 12. శ్రీరాముఁడు వానర సేనలతో లంక కేఁగి రావణుఁగూల్చుట

తరువాత శ్రీరాముఁడు వానర వీరులతోఁగూడ సముద్రతీరముఁ జేరెను. అక్కడ నిష్ఠతోఁ దర్భశయనంబుననుండి తెరువీయుమని సముద్రునిఁ బ్రార్థించెను గాని సాగరుఁడు లెక్కచేయలేదు, రాముఁడంత రోషకషాయితాక్షుఁడై సముద్రుపై బ్రహ్మాస్త్రమేయఁబూన భీతుఁడై సాగరుఁడు

శ్లో॥ రఘువీర మహాబాహో!
త్వదాగమనతోషితః
త్వదన్వయ ప్రసూతోఽహం
ప్రతికూలోస్మి తే కథమ్,

శ్లో॥ నలహస్తేన మన్మధ్యే
లగుడాద్రి ద్రుమాన్వితమ్
మృత్సైకతావృతం సేతుం
బంధయాశు రఘూత్తమ! పు॥

అని ప్రార్థింప శ్రీరాముఁడు సంతసించి

శ్లో॥ అనేక వానరబల
సమాసీతాగ సంచయః

నలహస్తేనవారాశిం
బద్ధ్వాలంకాముపాగమత్. వా॥ పు॥

వానర వీరులచేఁ దేబడిన పర్వతాదులచే సముద్రమునకు వారధిఁగట్టించి లంకాపురిఁ బ్రవేశించి యంగదుని రాయబారిగా రావణు కడకంపెను గాని లాభము లేకపోయెను, అప్పుడు రాముఁడు సామదాన భేదములచే రావణుఁడు లొంగఁడని తలఁచి యుద్ధముచే సాధింపఁబూనెను.

అట విభీషణుఁడు రావణుఁడు చెడునను భీతిచే జగన్మాతయగు సీతను శ్రీరామున కొసఁగి సేమమందుమని యన్నకు బోధింప రావణుఁడు క్రుద్ధుఁడై యాతనినిందించి దేశంబు వెడలిపొమ్మని తీవరింప నేమియుఁజేయఁజాలక విభీషణుఁడాకాశమార్గమున రాముఁడున్నచోటి కరుదెంచి శరణు వేఁడెను, ఈతఁడు పగవానితమ్ముఁడు శరణొసగకుండని సుగ్రీవాదులు చెప్పినను, హనుమంతుఁడీ మహాత్ముఁడుత్తముఁడని రామునితోఁజెప్పినందున శ్రీరాముఁడు విభీషణునికి శరణొసఁగెను. తరువాత నుభయ సైన్యములును యుద్ధంబునకు సన్నద్ధములాయెను. రక్కసులలోఁ బెక్కుమంది హతులైరి. హతశేషులు పారిపోయి రావణునితో మొఱపెట్టుకొనఁగా ఇంద్రజిత్తు యుద్ధమున కేతెంచి రామలక్ష్మణుల నాగపాశబద్ధుల నొనర్ప గరుత్మంతుఁడు వెంట నేవారిఁ దత్పాశముక్తులఁ గావించెను. పదపడి ధూమ్రాక్షుఁడకంపనుఁ డనువారు సమరంబునకు రాఁగా హనుమంతుఁడవ్వారిఁ దునుమాడెను. తరు

వాత వజ్రదంష్ట్రుఁడు ప్రహస్తుఁడు నరుదెంచి యంగదనీలులచేఁ జచ్చిరి.

అంత రావణుఁడు దుఃఖాక్రాంతుఁడై స్వయము యుద్ధమున కేతెంచెను. కాని మారుతి గ్రుద్దియుఁ దన్నియు మూర్ఛ పుచ్చెను. మూర్ఛ తెలిసిన తరువాత శ్రీరాముఁడాతనితో జన్యమొనరించి పాఱఁదోలెను. అంత రావణ ప్రేరితుఁడై కుంభకర్ణుఁడు యుద్ధరంగమునకు వచ్చెనుగాని యాతండు వెంటనే శ్రీరామునిచే హతుఁడాయెను. ఆవల నరాంతక, మహోదర, త్రిశిరో, దేవాంతక, మత్తులను దైత్యులుకలని కాయత్తులై క్రమముగా నంగద నీల హనుమదృషభులచే మృతిఁగాంచిరి. అతికాయుఁడను మహావీరుఁడు లక్ష్మణునిచే మడిసెను. తరువాత నింద్రజిత్తు సమరంబున కరుదెంచి హనుమజ్జాంబవద్విభీషణులను దప్ప నందఱిని మూర్ఛపుచ్చ హనుమంతుఁడు జాంబవంతుని యాజ్ఞచే సంజీవనౌషధమును దెచ్చి యందఱిని బ్రదికించెను.

తరువాతఁ బ్రజంఘుఁడును గుంభుఁడును, నికుంభుఁడును యుద్ధమున కరుదెంచి క్రమముగా నంగద, సుగ్రీవ, హనుమంతులచే మడసిరి. మకరాక్షుఁడు శ్రీరామునిచే విగతాసుఁడాయెను అదివిని యింద్రజిత్తు కోపాతిరేకమున బహుసేనా సమేతుఁడైయనేక మాయలుపన్నెను గాని తుదకు లక్ష్మణుఁడు శ్రీరామనామ మహామంత్రమును జపించి

శ్లో॥ ధర్మాత్మా సత్య సంధశ్చ
రామోదాశరథిర్యది

పౌరుషే చాప్రతిద్వంద్వః
శరైనం జహి రావణిమ్.

శ్రీ రా.

గీ॥ సారధర్మాత్ముఁడును సత్యసంధుఁడేని
రామచంద్రుండు దశరథరాజ సుతుఁడు
పౌరుషముననును నప్రతిద్వంద్వుఁడేని
శరమ! ఈరావణాత్మజు సంహరింపు

అని శ్రీరామ నామాను సంధానముతో బాణము వేయ నింద్రజిత్తు తలతెగి శ్రీరాముని పాదములపైఁ బడి దానిలోనుండి తేజము శ్రీరామునందు లీనమయ్యెను. ఇంద్ర జిత్తు దక్షిణహస్తము వాని భార్యయగు సులోచన ముందు పడెను.

ఆ మహాపతివ్రత పతి కరం బుపలక్షించి దుఃఖించుచుఁ బత్రమును లేఖినియుఁ జేతికీయ నాహస్తమిట్లువ్రాసెను "ప్రాణేశ్వరీ! నాకొఱకై విలపింపకుము. నీకు జనకుండును, నాకు శ్వశురుండునగు లక్ష్మణస్వామిచే నేను శ్రీరామనామ శ్రవణపూర్వకముగాఁ గడతేర్పఁబడి శ్రీమహావిష్ణువగు శ్రీరా మునందుఁగలిసి వైకుంఠ సౌఖ్యముల ననుభవించుచున్నాను. నీవు నాశరీర మగ్నియందుంచి సహగమన మొనర్చి నాతో సౌఖ్యమనుభవింపఁ జనుదెమ్ము" అది చదివి తన తండ్రియగు నాదిశేషుఁడే లక్ష్మణుఁడని యెఱింగి లక్ష్మణు పాదంబులపైఁ యేడ్వ సౌమిత్రియుఁ బూర్వగాథను దలపోసికొని దుఃఖింప సాగె. అంత శ్రీరాముఁడు కరుణించి యింద్రజిత్తు శిరముఁ

గబంధమునకు సంధించి బ్రదికించెను. ఇంద్రజిత్తు రామలక్ష్మ ణులకు నమస్కరించి సులోచనను సమాధానపఱచి వెండియు వైకుంఠమున కేగెను. పతివ్రతా తిలకము సులోచన సహగ మన మొనర్చి భర్తతో విష్ణు సన్నిధానమునఁ గైవల్యసుఖముల ననుభవించెను.

ఇది యంతయుఁగని వానరు లాశ్చర్యమందుచుండ శ్రీరామనామ మొనర్చుకొనుచు నారదుండు డట కేతెంచి యిట్లనియె

తొల్లి రావణానుమతిచే నింద్రజిత్తు పాతాళలోకమున కేఁగి యందు వనవిహార మొనర్చుచున్న యాదిశేషుని కూఁతు రగు సులోచనను జూచి మోహించెను. సులోచనయు నాతనియెడ ననురక్తయగుటంజేసి వారిరువురు గాంధర్వమునఁ బరిణీతులైరి అది శేషునకుఁ దెలియకుండఁ గొంతకాలముంచిరి ఆవల నాదిశేషుఁడది యెఱింగి నిజానుమతిలేకయే తన సుతఁ బెండ్లాడిన యన్నిచుం దెగటార్తునని యింద్రజిత్తుపై కరుగ సులోచనాదేవి తండ్రి కాళ్ళపైఁబడి పతిఁజాపవలదని ప్రార్థిం పఁగా నవతారాంతరమున నీనిఁబరిమార్తునని యప్పటికి మన్నించి విడిచిపుచ్చెను. అంత సులోచనేంద్రజిత్తులు రథా రూఢులై లంకకరిగిరి. ఆకారణమున శేషావతారభూతుఁడగు లక్ష్మణస్వామి యింద్రజిత్తునకు మిత్తియాయెనని నుడువుచుండ గనే వానరులందఱు లక్ష్మణస్వామి యాదిశేషుఁడా? యని యెంతయు వినుతించిరి. వేల్పులు విరివానలఁ గురిపించిరి

నారదుండు శ్రీరామ లక్ష్మణుల స్మరించుకొనుచు నాగలోకమునకుఁజనియెను.

అంత విరూపాక్ష మహాపార్శ్వులను రక్కసులు సుగ్రీవాంగదులచే మడయ మదోద్రేకంబున రావణుఁడు యుద్ధంబున కరుదెంచి తన యమోఘ ఘంటాశక్తిచే లక్ష్మణుని మూర్ఛపుచ్చ హనుమంతుఁడు సంజీవనిఁగొనివచ్చి సౌమిత్రిని బ్రదికించెను. అప్పుడు దశకంధరుఁడు సర్వబలంబులతో సమరరంగమున శ్రీరామునితో ఘోరంబుగాఁబోరి తుదకు సపుత్త్రమిత్ర పరివారముగా నంతమొందెను. ఇట్లు సుగ్రీవ హనుమదాది మహావీరుల సాయముచే శ్రీరాముఁడు

శ్లో॥ సపుత్త్రి మిత్రం సామాత్యం
సానుజం దశకంధరమ్
నిజఘాన మహాయుద్ధే
ధైర్యస్థైర్య బలాన్వితమ్ పు॥

అన్నట్లు సంపూర్ణవిజయంబుఁ బడసి విభీషణుని లంకాధినాథుగా నలిపి

శ్లో॥ అథాగ్నౌ రాఘవః సీతాం
ప్రత్యయిత్వా ప్రగృహ్యాచ
రమ్యా మయోధ్యామగమ
త్కపిశభల్లూకరాక్షసైః పు

పైవిధముగా నగ్ని పరిశుద్ధయగు జానకితోను రణరంగమునఁ దనకుఁ దోడ్పడిన సుగ్రీవ హనుమజ్జాంబవద్విభీషణాదులతో నయోధ్యకేఁగి రాజ్యాభిషిక్తుఁడై

క॥ తంద్రిక్రియ రామచంద్రుఁడు
తంద్రుల మఱపించి ప్రజలఁ దారక్షింపన్
తంద్రుల నందఱుమఱచిరి
తంద్రిగదా రామచంద్ర ధరణిపుఁడనుచున్

శ్రీ. బా.

ప్రజలఁ బుత్త్రిలమాడ్కిఁ గాపాడుచుఁ బదివేలపైఁ బది నూఱేండ్లు రామరాజ్యంబున నిరీతిబాధకంబుగా రాజ్యంబు చేసి యెల్లవారి నానందాబ్ధి నోలలాడించెను.

శ్లో॥ ఇదం పవిత్రం పాపఘ్నం
పుణ్యం వేదైశ్చ సమ్మితమ్
యఃపఠేద్రామ చరితం
సర్వపాపైః ప్రముచ్యతే. బా॥ రా॥

## శ్రీరామ ధ్యానము.

శ్లో॥ కాకపక్షధరం దేవం
నీలమేఘ సమచ్ఛవిమ్
ధ్యాయామి శ్రీపతిం రామం
లక్ష్మణానుచరం పరమ్. ౧

శ్లో॥ కృత్వా శివధనుర్భంగం
భూసుతాం పరిణీయచ
అయోధ్యాం పునరాయాతం
సీతా జానిమహాంభజే. ౨

శ్లో॥ జితామిత్రం జితక్రోధం
రామం రాజీవలోచనమ్
కౌసల్యా నందనం వీరం
విశ్వామిత్ర ప్రియం భజే. ౩

శ్లో॥ మహాప్రాజ్ఞం మహావీరం
మహేష్వాసం మహాహనుమ్
ధ్యాయామి దైత్యహంతారం
పితృభక్తం ధనుర్ధరమ్. ౪

శ్లో॥ విరాధ రాక్షసహరం
వనమాలా విభూషణమ్
రాఘవం జానకీజానిం
భక్త్యాఽహం మనసాభజే. ౫

శ్లో॥ రామం కాకాసురారాతి
మిందీవరతను ప్రభమ్
వనమాలాధరం దేవ
మిష్టప్రదమహాంభజే ౬

శ్లో॥ వాలి వానర విధ్వంసం
సుగ్రీవ సుహృదం విభుమ్

హనూమత్సేవితం దేవం
రామం శ్యామల మాశ్రయే. ౭

శ్లో॥ సర్వవానర సంసేవ్యం
రామం రఘుకులోద్భవమ్
వీరోత్తమం దాశరథిం
నమామి శిరసాదరాత్. ౮

శ్లో॥ యత్పాదగతయా భక్త్యా
శాఖామృగ శిశుఃపురా
సింధుముల్లంఘయామాస
రాఘవం తమహంభజే. ౯

శ్లో॥ రాఘవం రావణారాతిం
దుష్టరాక్షస మర్దనమ్
రఘువంశాబ్ధి శీతాంశుం
సీతాపతి మహంభజే. ౧౦

శ్లో॥ సర్వమాలా మనోజ్ఞాంగం
సర్వాభరణ భూషితమ్
హనూమత్సహితం దివ్యం
రామచంద్రమహంభజే. ౧౧

శ్లో॥ సీతాపతిం దాశరథిం
హనుమత్సేవితం ప్రభుమ్
ఇందీవరస్ఫురద్గాత్రం
భక్త్యాఽహం మనసా భజే. ౧౨

శ్లో॥ ఆనందహృదయానందం
భక్తకల్ప మహీరుహమ్
శ్రీసచ్చిదానంద కృపం
రామం దాశరథిం భజే. ౧౩

శ్లో॥ మంగళం రామభద్రాయ
మహనీయ గుణాబ్ధయే
మంగళం రామచంద్రాయ
సాకేత పురవాసినే. ౧౪ గ్ర॥ స్వ॥

## 13 శ్రీసీతారాములు హనుమంతుని బహూకరించుట.

శ్రీసీతారాములు పట్టాభిషిక్తులై దర్బారులో నుండు నప్పుడు సీతాదేవి తన కతిప్రియంబు నమూల్యంబునగు మౌక్తికహారంబు మెడనుండి తీసి చేతఁబట్టుకొనియుండ శ్రీరాముఁడు ప్రేయసీ! యీ ముక్తాహారమును నీకు సాహాయ్యకారి యగు నాపుత్రునకొసఁగుమన సీత మందహాసముతో హనుమంతుని మెడలో నిడ నాంజనేయుఁడద్దాని సాదరంబుగాఁ గొని చుక్కలలో జాబిల్లివలె నా సభలో విరాజిల్లెను.

## 14 హనుమంతుఁడు చిరంజీవియగుట

సీతారాములీ లోకమును విడనాడి వైకుంఠమునకు వేంచేయునపుడు హనుమంతుఁడు భక్తిప్రపత్తులతో వారికి నమస్కరింప

శ్రీరాముఁడు:— 'మారుతీ నీయిాప్సితమేమి ?

హనుమంతుఁడు—స్వామీ ! మీనామమెంతకాల మీపుడ
మిలో నుండునో యంతకాలము జీవించి
యుండునట్లు వరమిమ్ము.

శ్రీరాముఁడు—'సూర్యచంద్రు లుండువఱకును నానామ మీ
లోకమున నుండువఱకును నీవిందు జీవించి
భావిబ్రహ్మవయ్యెదవుగాక' యని వరమిచ్చి
సీతతోఁ బరధామమున కరిగెను.

## 15 హనుమంతుని స్థానము

హనుమంతుఁ డిప్పటికిని జీవించియే యున్నాఁడని
యభిజ్ఞులవాదము.

భారత ప్రమాణముచేఁ గొందఱీ మహాపురుషుఁడు
బదరికాశ్రమములో నున్నాఁడనియు భాగవతాధారముచే మఱి
కొందఱీ భావిబ్రహ్మ కింపురుషఖండ మలంకరించి యున్నాఁడ
నియు, శతకంఠ రామాయణానుసారముగా నొక కొందఱీ
యుత్తముఁడు మహేంద్రాద్రిపై నివసించుచున్నాఁడనియుఁ
జెప్పుచున్నారు.

గద్య

ఇది శ్రీ మదాంజనేయ ప్రసాదాసాదిత కవిత్వ నిశ్చయ సుజన
విధేయ, పణుకునూళ్ల గోత్రోద్భవ క్రొత్తకులజలధి
శీతాంశు రత్నాంబా వీరభద్రతనయ శ్రీ సచ్చిదానంద
నామధేయ ప్రణీతమైన హనుమద్విజయంబునఁ
బ్రథమాధ్యాయము.

శ్రీరామ



# హనుమద్విజయము

## ద్వితీయాధ్యాయము

---

### 1 సువర్చలాంజనేయుల వివాహము

విశ్వకర్మకొక మహాసుందరియగు నందని యుండెను. ఆయమ సూర్యుని బరిణయమై యాతని యొద్దకుం గాంపురము సేయంజనెను. ఆయన తాపమునకుం దట్టుకొనలేక యది జనకునకు విన్నవింప నాతండు సూర్యుని యొప్పుకోలుపైం దత్తైక్ష్ణ్యము తగ్గింప సానపెట్టెను. తద్బింబమునుండి రాలిన యాతేజః పరమాణువులనుండి యొక యందగత్తె యావిర్భవించెను. ఆమె మిగుల వర్చస్విని యగుటచే సువర్చలయను పేరుపెట్టిరి. ఆమె సూర్యుకడం బెరుంగుచుండెను.

హనుమంతుండు సూర్యసన్నిధిని సమస్త విద్యల నేర్చి గురుదక్షిణ నొసంగుతలంపు ప్రభాకరునకు వెలిపుచ్చ నాతం డాంజనేయుంజూచి యోయీ! నీవు మా సువర్చలాదేవిని

దేవేరిగాఁ గొనుటయే నాకు గురుదక్షిణయని పలుక మారు మాటాడలేక హనుమ గురుపుత్త్రికయగు సువర్చలను బెండ్లాడెను.

## 2 హనుమంతుఁడు ముక్తాహారమును ద్రెంచుట

మొదటి యధ్యాయాంతమున సీతాదేవి రామాజ్ఞచేఁ దమకు మహోపకారియగు హనుమకు మౌక్తికహార మొసంగి గౌరవించెనను సంగతిఁ బాఠక మహాశయులకు విశదమే.

అట్లు సీతచే సత్కృతుఁడై సమీరసూనుఁడా ముక్తాహారమును జేఁగొని పరిశీలించుచు నొక్కొక ముత్యమును దీసి గంటియొద్దను జెవియొద్దను బెట్టుకొని పాఱవేయుచుండెను. ఇట్లు ముత్యముల నన్నియుఁ బాఱవైచుచు హారమును గూడ దవ్వుగా విసరివైచెను. ఇందలి భావము సీతారాములకుఁ దప్ప మఱెవ్వరికిఁ దెలియమిచే జాంబవంతుఁడంజనా నందనుతో నిట్లనియెను.

“ఆంజనేయా! ఏమిది? జాతిచర్యల విడనాడవైతివి. రాజదత్తమగు ముక్తాహారము నట్లు చేయవచ్చునా?”

నావుడు హనుమ “ఋక్షాధీశ్వరా! నేను వ్యర్థుఁడనై యీ ముత్యములనట్లు పాఱవేయలేదు. ఈ మౌక్తికంబులలో నెందైన రామనామము లిఖింపఁబడె నేమోయని చూచితిని

లిఖింపఁబడలేదు. పోనీ రామనామము ధ్వనించునేమో యని చెవియొద్ద నిడుకొని చూచితిని. అదియు వినఁబడలేదు. రామ నామరహితమగు నీమౌక్తికహారము నాకేటికని పాఱవైచితి"నన సభాసదులెల్ల రిట్లనిరి. "ఓయీ! ఎంత పిచ్చివాఁడవు. నవవ్యాకరణములఁ జదివితివి సర్వశాస్త్రార్థముల నెఱుంగుదువు నీకీమాత్రము దెలియదేల? అచేతనమ్ములగు ముత్యమ్ములు రామనామము నెట్లు ధ్వనించును?

మారుతి మందహాస మొనర్చుచుఁ దనతోఁక వెండ్రుక నొకదానిని బెఱికి జాంబవంతునకీయ నాతఁడది శ్రవణ సమీపమున నిడుకొన దానినుండి రామనామ ధ్వని వినఁబడెను. అందఱు నా యద్భుతముఁ గన్నులారఁగని యాంజనేయుని భక్తి కాశ్చర్యపడిరి.

## 3 హనుమంతుఁడు రామాయణమును రచించుట

హనుమంతుఁడు తన పాండిత్య ప్రకర్షము లోకమెఱుంగ నొక రామాయణంబు వ్రాసి రామున కంకితమీయ నెంచి శ్రీరాముఁడు పండిత మండలితోఁ గొలువుదీర్చియున్న సమయమున నా గ్రంథము చదివించుకొని వినుమని రామున కర్పించెను.

శ్రీరాముఁడు దానిని గ్రహించి సభవంకఁజూచి యిద్దాని నెవ్వరేనిఁ బఠింపుఁడన నవవ్యాకరణ వేత్తయు సకల శాస్త్రార్థతత్త్వజ్ఞుఁడునగు నాంజనేయుని కృతిఁ బఠించుటకు

నెవ్వఁడును సాహసింపలేదు. అపుడు జాంబవంతుఁడు లేచి రామ
చంద్రా! నే నిద్దాని బఠింపఁ జాలఁగాని బఠించువానిని మా
త్రము చెప్పెదను వినుము. స్వయముగా వ్యాకరణ కర్తయు
నాదిశేషావతార భూతుఁడునగు నీ సోదరుఁడగు లక్ష్మణ
స్వామియే దీని పఠింపఁదగినవాఁడు అనుచుండఁగనే వాల్మీకి
మహాముని యరుదెంచెను. ఆయనకుఁ గూర్చుండఁ గొల్వునఁ
దావు లేమింజేసి శ్రీరాముఁడు తన యర్ధాసనమొసంగెను.
అందఱు నానందముతో విన సౌమిత్రి హనుమద్రామాయ
ణమున నందలి కొన్ని శ్లోకములఁ బఠించెను. అందులో నిది
యొక శ్లోకము శైలికై యుదాహరించుచున్నాను.

శ్లో॥ అయిఖలువిషమః పురాకృతానాం
భవతి హిజంతుషుకర్మణాం విపాకః
శివశిరసి శిరాంసియాని రేజుః
శివ శివతా నిలుఠంతి గృధ్రపాదైః క॥ చ॥

"ఆహా పురాకృత కర్మపరిపాకము జీవులయందు విష
మముగాఁ బరిణమించుచున్నది. ఏ శిరస్సులు శివశిరస్సునఁ
బ్రకాశించినవో యా రావణుని శిరస్సు లిప్పుడు గృధ్రపాదం
బులఁ బొరలింపఁబడుచున్నవిగదా! ఔరా యీ శ్లోకభావ
మెంత మనోహరముగానున్నది. ఆయర్థ గాంభీర్యము మనోజ్ఞము.
పదలాలిత్యము వర్ణనాతీతము, ఆగ్రంథము నందలి శ్లోకభావ
ములకు నలంకార చమత్కారములకు రసవిశేషంబులకు
సదస్యులెల్లరు సాధువాద మొనర్చిరి. అదివిని శ్రీరాముని

ప్రక్కనే యుపవిష్టుఁడైయున్న వాల్మీకి తన రామాయణము ప్రఖ్యాతి పొడగునేమోయని రాముని దీనదృష్టులఁజూడ నా జాడఁదెలసి రామచంద్రుఁడు హనుమంతునితో నాంజనేయా! నేను వాల్మీకిరామాయణమునే యనుసరించుచున్నానన నందలి గూఢాశయమెఱింగి హనుమంతుఁడుస్వకృత రామాయణంబును గడలిలోఁగలిపివేసెను.

## 4 హనుమంతుఁడు పంగునకు వరమిచ్చుట

ఆంజనేయుఁ డావిర్భవించునపుడే సహస్రకవచకుండల ములతో నావిర్భవించెను. తరువాత సూర్యునొద్దఁ జదువు చుండఁగా

శ్లో॥ తస్మిన్ కాలేదురాచారః
పంగుర్నం సేతునందనః
గుదస్థానం హనుమతః
శిరసోవాహ భక్తితః పు॥

జం సేతునందనుఁడగు పంగువా హనుమంతుని చదువు పూర్తియగువఱకు భక్తిశ్రద్ధలతో నాతని మోయుచుండెను. అతని శుశ్రూషకు మెచ్చి హనుమంతుఁడు వరమడుగుమన నా పంగువు హనుమానుని కవచకుండలంబుల వేఁడ మారు మా టాడక మారుతి యాతని సఫలీకృతమనోరథు నొనర్చెను. అట్లు కపీంద్రువలనఁ గవచకుండలములఁగొని యాపంగువు లోకముల బాధవెట్టసాగ నరనారాయణులు లోకోపకారంబున కాతని కవచకుండలముల హరించిరి. తరువాత నాపంగువే

ద్వాపరాంతమునఁ గర్ణుఁడై జనింప నరనారాయణులే యర్జు
నుఁడుగాఁ గృష్ణుఁడుగా నవతరించి వానిని దునుమాడిరి.

## 5 సహస్రకంఠవధ

శ్రీరాముఁడు రావణాది రాక్షసవధ మొనర్చి యశ్వమేధ
మొనర్చెను. హయమువెంట భరత శత్రుఘ్నులు సేనాస
మేతులై వెళ్లిరి. వారు కోసల కేకయ, సౌరాష్ట్ర, సౌవీరాంగ,
వంగ, కళింగ, బాహ్లీక, పాండ్య, చోళ, కర్ణాటక, పుళింద,
మగధ, కొంకణ, ఉంకణ, మత్స్య, విదర్భ, పారసీక, పాశ్చా
త్త్యాది దేశములఁ దిరిగితిరిగి వచ్చి సింధునదీతీరమున విడిసిరి.
యారాత్రి యచ్చోటనే వసించి మఱునాఁడు లేచిచూడఁగా
నశ్వము గానరాదాయెను. భరతుఁడు విచారమంది యొక
సలేఖమగు బాణంబుఁ జాకశాసనుకడకంప నాతండదరిపడి
వాచస్పతి సహితముగా వచ్చి భరతునకు మ్రొక్కి నిలువ
బృహస్పతి భరతునితో నిట్లనియెను. రఘువంశాలంకారా!
భరతకుమారా! ఈ యింద్రుఁడు నీయశ్వంబు నించుకయు
నెఱుంగఁడు-మహాత్ముఁడును మహావీరుండునగు శ్రీరాము
హయంబు హరింప నీతనికి ధైర్యమెక్కడిది? అయ్యశ్వంబు
నదితికశ్యపుల కుద్భవించిన సహస్రకంఠ రావణుఁడపహరించెను
అని యింద్రోపేతుఁడై యమరావతి కేగెను. ఈసంగతిని భరత
శత్రుఘ్నులు రామున కెఱిగింప నాతండు మునులతో నాలో
చించువాఁడై వారిని రావింపుమని యాజ్ఞాపింప లక్ష్మణుఁడు
వామదేవ, వాలఖిల్య, వసిష్ఠ, వాల్మీక్య, గస్త్య, నారద,

కండు, శౌనక, సూత్రైభ్య, కణ్వ, రోమశ, పటు, శక్తి, శాంఖిక, గౌతమాం, గిరస, విశ్వామిత్ర, గార్గ్య, మార్కండే యాది మహామునుల బిలచి శ్రీరాముఁడవ్వారితో నిట్లనియె మహామునులారా! నే నశ్వమేధ మొనర్చుచుండఁగా నెవఁడో సహస్రకంఠ రావణుండఁట నా యజ్ఞాశ్వమపహరించెను వాని వృత్తంబు వినవలఁతును అన నగస్త్యుఁడు

రఘూత్తమా! తొల్లి పుష్కరద్వీపమునఁ జిత్రావతీ పురమునఁ గాశ్యపసూనుఁడగు సహస్రకంఠ రావణుఁడు రాజ్యము స్థాపించి యేలుచుండెను. అతఁడు బ్రహ్మాదులవలన వరములఁబడసి మూఁడులోకములను జయించెను ముక్తినిగోరి శ్రీహరిస్తుతింప శ్రీహరి యాతనికిఁ బ్రత్యక్షమాయెను. అప్పుడు సహస్రకంఠుఁడు స్వామీ! నన్ను మీకు వాహనముగాఁ గొనుమన శ్రీహరియు 'తథాస్తని యదృశ్యుఁడాయెను.

అతఁడిప్పుడు శ్రీహరి సంపూర్ణావతారమగు నీచేఁ జావ నెంచి గోబ్రాహ్మణహింసకుఁడైనాఁడు కాఁబట్టి శ్రీరామా! అతని దెగటార్చి లోకముల రక్షింపుము అని నుడివి మును లతోఁగూడ వెడలిపోయెను.

అంతఁ గార్యజ్ఞుఁడగు రఘూత్తముఁడు దూతలచే సుగ్రీవ విభీషణులను దదన్యరాజన్యులను బిలిపించి సైన్యముల జన్యమున కాయత్తపఱచి భరతాది సోదరులతోడను హనుమ దాది మహావీరులతోడను, సుగ్రీవాది మిత్రులతోడను రణ భేరులు భోరుమనఁ బయనమై యూరిబయిట విడిసెను.

అప్పుడు శ్రీరాముఁడు స్మృతమాత్రోపపన్నమగు పుష్పక విమానమును సభ్రాతృమిత్ర పరివారంబుగా నధిష్ఠించి నవ్విమానమాకాశ మార్గమునఁ జనిచని చిత్రవతీపురసీమ యందు నిలిచెను. అంత రాముఁడాంజనేయుని బిలిచి యోయీ! అస్మదాగమనవార్తను సహస్రకంఠున కెఱింగింపు మన హనుమ వాయుగమనంబున సింహద్వారంబు దరిసి

గీ॥ చిత్ర వర్ణశుకాంగుఁడై చిత్రవర్ణ
రత్నగాంగేయమయ శుకరమ్యతనువు
గలువానివిధంబుగాఁ గానఁబడియె
శ్వసనపుత్త్రిండు దుర్భర శౌర్యపరుఁడు.

శ॥ రా॥

శుకాకారంబుతో రాక్షసేంద్రుని కొలువుకూటముఁ జేరెను.

అప్పుడు మనోహరాకారమగు నాకీరముంగని సహస్ర కంఠుఁడు లోహితాక్షుఁడను భటునితో నద్దాని తెలంగెలుంగు మన నాతఁడా చిలుక చెంతకరిగి ఓఖగమా! నీవెవరవు? నీ తండ్రియెవఁడు? నీదేశమేది?

క॥ హరివహ్నికాల నైఋతి
వరుణానిల యక్షరాజభవులందెవఁడీ
పురిఁజూచి రమ్మటంచని
పురుణింపఁగవచ్చినావో పోఁజాలవిఁకన్.

శ. రా.

అని పరుషంబుగాఁ బలికిన సరుషంబై యాచిలుక లోహితాక్షు లక్ష్యంబుసేయక రాక్షసేంద్రువలనై ఓయీ సహస్రకంఠా ! నీవు కోసలాధీశ్వరుఁడును రావణ కుంభకర్ణాది రాక్షసారణ్యదవానలుండునగు రామభద్రు నెఱుంగవే ? ఆయన పంపున నేనిటకే తెంచితిని. నీవు దేవర్షి గోబ్రాహ్మణాదుల హింసించుచున్నావని తెలిసి శ్రీరాముఁడు నీపై మండిపడుచున్నాఁడు. ఇఁకనైనను నీవట్టి దుష్కార్యములఁ మాని దారికివచ్చిన సరి లేనిచో రావణ కుంభకర్ణాదులగతియే నీకుఁ బట్టునని నాముఖముగా నీకు సందేశమిచ్చుచున్నాఁడు. మఱియు నీవు రామభద్రుని యశ్వమేధాశ్వముఁ గొనివచ్చితివఁట యజ్ఞవిధ్వంసకుల ధ్వంసమొనర్చుట శ్రీరాముఁడు బద్ధకంకణుఁడని యెఱుంగవు కాఁబోలు, ఇంతకును నీ కంతకాలమాసన్నమైయుండ మంచిబుద్ధి యెట్లుపుట్టును ? అని యా చిలుక పలుకుచుండఁగనే యా రాక్షసేశ్వరుండు రూక్షమానసుండై యా శుకంబుఁ జంపుమన శుకాకారంబుననున్న యాహనుమ

క॥ శుకరూపు వదలిమింటికిఁ
బ్రకటితగతి నెగిరిపోయి రయమునఁ దన్మ
స్తకముల సకిరీటంబుల
వికలంబుల్ గాఁగఁదన్ని పృథివింద్రోచెఁ.

ఉ॥ అంతటఁబోక వాని సకలాంగవిరాజిత భూషణంబులన్
వింతగఁబిండిచేసి భువి వేగమెత్రోసికడంగి స్తంభమున్

బంతమెలర్పఁగాఁ బెటికి బాహులమూపుల జానుజంఘలన్
సంతస మొప్పఁగాఁ జదిమి శౌర్యము ధైర్యము మీఱ నుండఁగన్.

శ॥ రా॥

పై విధంబుగ నోసర్చి యెదురులేని బలంబుతో నెదురు వచ్చిన వారిఁ జిదిమి వైచి రామాంతికముఁ జేరి యావద్వృత్తాంత మెఱుంగఁ జెప్పిన రామభద్రుండును రాక్షసరాజవధ దీక్షితుం డయ్యె. ఆసంగరంబున నాంజనేయుఁ డోసర్చిన యద్భుత బల ప్రదర్శనంబుల కంతమేలేదు. హనుమంతుని తోడ్పాటుచే వానరవీరులు రక్కసుల నుక్కాడ రామభద్రుఁడవలీలగా సహస్రకంఠ రావణుఁ జంపివైచెను. అప్పుడా రక్కసుని శరీరమునుండి యొక వెలుఁగు సర్వజనంబుఁ జూచుచుండ వెడలి వైకుంఠమునందలి యాదిశేషునందుఁ గలిసి శ్రీమహావిష్ణువునకుఁ బానుపాయెను. అంత శ్రీరాముఁడు భరతునిచే సహస్రకంఠ రావణుని కుమారుఁడగు పుష్కరాక్షునకుఁ బట్టాభిషేకము చేయించి యజ్ఞాశ్వముతో నయోధ్యకరుదెంచి సరయూ తీరంబున యథావిధి యశ్వమేధయాగంబు పూర్తిగావించెను.

## 6 శతకంఠ రావణవధ

తొల్లి పులస్త్యునకు విశ్రవసుఁడు నాశ్రమముఁడని యిరువురు పుత్రులుండిరి. విశ్రవసునకు రావణాదు లుద్భవించి శ్రీరామునిచే మడసిరి. ఆశ్రముఁడంపులకుఁ గొందలమంది ఘోరతపముఁ గావించి శతకంఠుఁడను నన్వర్థనాముఁడగు పుత్రుఁబడసెను ఆతఁడు పెద్దవాఁడై సహస్రవర్షంబు లంగు

ష్ఠాగ్రంబున నిలిచి తపమొనర్చి బ్రహ్మను బ్రసన్నుఁజేసికొని యా పరమేష్ఠివలన యక్షరాక్షస గరుడ గంధర్వ సిద్ధ విద్యాధర కిన్నర కింపురుష సుర నర వానరాదులవలనను మృగాండజాదుల వలనను మీనకచ్ఛపమకరాది జలచరంబులవలనను మరణము లేకుండ వరముఁగొనెను. మఱియు యుద్ధములోఁ దన దేహమునుండి పడిన యొక్కొక్క రక్తబిందువునకు నూర్గురు శతకంఠులుద్భవించునట్లుగూడ వరము గ్రహించెను.

తరువాత నాతఁడు శాకద్వీపాంతర్గతమగు నిజపురంబగు ప్రతాప లంకకుఁబోయి వరబలంబుచేఁ గన్నుమిన్నుగానక మునికుల నాశకుఁడుకాఁగా జహ్ను శాండిల్య జాబాల్యాది మహామునులెల్లరు వాని దాడికిఁ దాళలేక యయోధ్యకరిగి శ్రీరామునితో శతకంఠు దురాగతంబులఁ దెలిపి వాని బారి నుండి మమ్ము రక్షింపుమని వేడ నార్తరక్షకుఁడగు రామభద్రుఁడవ్వారి కభయమొసఁగి వారి బంపి శతకంఠుని జంపుట యెట్లగునాయని యాలోచింప లక్ష్మణుఁడు చేతకరుదెంచి అగ్రజా ! భరత శత్రుఘ్న, సుగ్రీవ, విభీషణాది బాంధవులును, అంగ వంగ కళింగ కాంభోజాది దేశాధీశులగు మిత్రులును, వీరాగ్రేసరుండగు పవననందనుఁడును జాంబవదంగదాది యోధాగ్రణులును గలుగ శతకంఠువధ కింతవిచారమేటికని ధైర్యోక్తులు పలుక రామచంద్రుఁడు లంకేశ్వరుండైన విభీషణుని మదిలోఁదలఁచెను. తలఁచినతోడనే యా లంకాధిపతి కృతాంజలియై రామునిముందు నిలువ రాముఁడానందమంది శతకంఠువిషయ మడుగ నాతఁడిట్లు చెప్పఁదొడఁగె.

రామచంద్రా! నవప్రాకారముల తోడను, సప్తసాగరములతోడను, పాతాళగంభీరమగు నగడ్తతోడను విరాజిల్లుచు నిరంతరముద్యతాయుధులగు రాక్షస వీరులచే రక్ష్యమాణయగు ప్రతాప లంకాపురంబున శతకంఠ రావణుఁడు మహావైభవముతో రాజ్యమేలుచున్నాఁడు. నావుడు రాముఁడు సప్తసాగర వేష్టితమగు ప్రతాపలంక కరుగుటయెట్లోయని విచారించి యాంజనేయుని బిలిపించి శతకంఠువధ సాధ్యమగునా యన నాతండేనొకండనే శతకంఠుఁబరిమార్పఁ జాలుదునని రామ విశ్వాసంబునకై విశ్వరూపంబుఁ జూపించిన శ్రీరాముఁడు సంతసించి

"శ్లో॥ జితం భగవతా తేన
హరిణా లోకధారిణా
అజేన విశ్వరూపేణ
నిర్గుణేన గుణాత్మనా." శా॥ రా॥

అని ప్రశంసించెను అంత హనుమంతుఁడు తన విశ్వరూపము నుపసంహరించుకొనెను.

తరువాతశ్రీరాముఁడు విభీషణుని మణిమయ భూషణాదుల సత్కరించి లంకకుఁ బంపుచు మరలఁ ద్వరలో యుద్ధమునకు సర్వసేనలతోఁ దోడ్పడుమని కోరెను.

మఱియు సపరివారముగా సుగ్రీవుఁదోడ్తేర లక్ష్మణుని హనుమంతుని బంప వారు నిరంతర ప్రయాణంబులఁ గిష్కింధఁ జేరి సుగ్రీవ సన్మానితులై రామాజ్ఞ నెఱింగింప నాతండును గౌతుకంబుగొని జాంబవత్సుషేణకుముద గోముఖాది సేనా

నాయకులతో జయజయనాదములు మిన్నుముట్ట హనుమల్ల క్ష్మణులతో నయోధ్య కరుదెంచెను. శ్రీరాముఁడు సంతసించి వారికిఁ దగిన విడుదులఁజూపెను. ఇంతలో విభీషణుఁడును హరనీలాది మంత్రులతో సేనాసమేతుఁడై యయోధ్యకువచ్చి శ్రీరాముల మన్ననకు గుఱియాయెను.

అంత భరత శత్రుఘ్నులు యవన కాంభోజ బర్బర సౌరాష్ట్రాద్యనేక దేశములకుఁజని రామాజ్ఞ నివేదింపఁ దత్తద్దేశాధిపతులు నయోధ్యకే తెంచిరి.

తరువాత రామచంద్రుఁడు రాజ్యభారము సుమంత్రాది మంత్రిపుంగవుల కప్పగించి సైన్యంబు జన్యసన్నద్ధంబుఁగావించి సెలవుగొన సీతకడ కేఁగ నాజనకనందన యానందంబుతో వల్ల భునితో మెల్లననిట్లు విన్నవించె.

నాథా! యుద్ధరంగంబున మీ ప్రతాపాదులఁ గన్నులారఁగాంచ నాకెన్నినాళ్లనుండియోగలదు. భారముగాదేని నన్నును దమతోఁగూడఁ గొనిపోవఁ బ్రార్థింతునని సవినయం బుగా వేఁడికొన రామచంద్రుఁడు సీతా సమేతుఁడై సకల నృపులుగొలువ దివ్యరథమెక్కి హనుమత్సారథ్యముతో సముద్ర తీరంబుఁజేరెను. ఈ సప్తసాగరముల దాఁటుట యెట్లా యని రాముఁడనుమానించుట నారసి వెంటనే యాంజనే యుండు విశ్వరూపముదాల్చి యెల్లరను దనపై నిడుకొని నక్షమఁ బొడము నాటంకముల వాలచాలనంబులఁ దూలఁ

జేయుచు సప్తసముద్రముల సత్వరము దాటించి శాకద్వీపమునఁ జేర్చెను.

అప్పుడు శ్రీరాముఁడు మారుతి నుపలక్షించి యోయీ నీవు శతకంఠ రావణుకడ కేఁగి దూతకృత్యము సలుపుమన నాంజనేయుఁడు వల్లెయని శతకంఠు సభాస్థలికరిగి యున్నత సింహాసనా సీనుండగు నసురేంద్రు నరసి తదాసనంబు కంటె నిజవాలంబున నత్యున్నతాసన్నమమర్చుకొని యందుపవిష్టుఁడై యుండ దైత్యేంద్రుండబ్బురపడి హనుమంతు వీక్షించి యోయీ నీ వెవఁడవు? ఎందుండి యిందులకరుదెంచితివి నన హనుమ యిట్లనియె. దైత్యేంద్రా! సర్గలక్ష్మీపుత్యా దేశమోయన నొప్పు నీపురంబుకంటె వేమడుంగుల మిన్నయై యయోధ్య యను నగర మొప్పారు. అద్దాని నఖిల నృపాలంకారుఁడగు రామ చంద్రుఁడు రాజధానిగాఁగొని యీ యవనీతలము నేకచ్ఛత్ర ముగా నేలుచున్నాఁడు. అతఁడసుర వధార్థమవతరించిన యాదినారాయణుఁడు. ఎందఱో మహర్షులు నీచే నిక్కట్లుఁబడి యామహాపురుషుని శరణు వేఁడ వారి కభయమిచ్చి నిన్ను నిర్మూలింప నాతఁడు సర్వసేనా సమేతుఁడై యిటకేతెంచి యున్నాఁడు. ఇప్పటికేని నీవు బుద్ధిగలిగి మహర్షుల జోలికిఁ జనక నాయపచారంబుల క్షమింపుమని రాము శరణుఁజొచ్చినే దప్ప యాతండు నిన్ను మన్నింపఁడు. జీవితేచ్ఛ యున్నచో రామునితోఁ జెలిమిఁ గావించి మనుము. లేనిచో నీ చావు తప్పదు.

నాపుడు రావణుఁడు కోపోద్దీపితుఁడై నాకు నీ రాముఁడు గీముఁడు నెంత? తులువా! ప్రల్లదములు చాలించి యవలకుఁ బొమ్ము. లేదా నిన్నిప్పుడే దెగటార్తు నని తర్జింప హనుమ యున్నతాకారుఁడై రత్నాసనమునం దున్న రావణు నేలపైఁ బడఁ బొడిచెను.

గీ॥ ఇట్లు పొడిచినఁ బడి తలలెల్లఁ బగిలి
యబ్బురంబుగ నెత్తురు లుబ్బి పాఱ
నపుడు మూర్ఛిల్లె, నతని సింహాసనంబుఁ
జూర్ణముగఁ దన్నె నమరులు చోద్యమంద.

స॥ రా॥

ఇట్లతని సింహాసనంబు చూర్ణము గావించి యంతతోఁ బోక యాతనిపై కెక్కి త్రొక్కి పిక్కిగుద్దుల మర్దించి బుద్ధి తెచ్చుకొమ్మని యటనుండి మరలుచు నెదురుపడిన మగల నెల్ల నొగలఁ జేయుచు రామసన్నిధానమున కరగి యెల్లవిషయంబులు తెల్లంబొనర్చె. అంత నిరుసైన్యంబులు జన్యంబునకుఁ దలపడ సుగ్రీవాది మహాశూరులు రావణ మంత్రులగు దీర్ఘ జింహ శిఖిముఖాదులఁ బ్రాడొందుగుర నుఱుమాడిరి. మఱియు రావణ సేనాపతులగు శార్దూలవదన రక్తాక్షాది వీరులును సపరివారంబుగ సమరభూమికి బలియైరి. రావణసేన లన్నియు రామప్రతాపాగ్నికి శలభంబులగుడు రావణుండు క్రుద్ధుండై రామునిపైకి వెడల వలదని తన తల్లి యెంత బోధించినను వినక రథారూఢుఁడై హతశేషులగు రక్కసులతోఁ గూడ

రాఘవుపై దాడి వెడలెను. ఆతని ప్రతాప జ్వాలలకు సీతా రామాంజనేయులు దప్ప నందఱును మూర్ఛిల్లిరి. సీతా రాము లాంజనేయు భుజముల పైనుండి రావణుతోఁ బోరిరి. శ్రీరాముఁడు వరుసగా రావణు తలల బాణంబులచే ఛేదించు చుండెఁ గాని యవి వెంటవెంటనే మరల మొలచుచునే యుం డెను. మఱియు నేలపైఁ బడిన రక్తబిందువులనుండి వందల కొలంది శతకంఠ రావణు లుదయించుచు యుద్ధ మొనర్చు చుండిరి. అప్పుడు శ్రీరాముఁ డించుక యలసినట్లు గనిపింప సీతామహాదేవి వల్లభుని విల్లు గైకొని యుద్ధ మొనర్చెను. ఎన్నిమార్లు నఱికినను దిరిగి రావణు శిరంబులు మొలచుచునే యుండెను. అప్పుడు గార్గేయ మహర్షి జానకితో హనుమ ద్ద్వాత్రింశాక్షరిని జప మొనర్ప మన నాయమ యట్లు చేసెను. అంత మారుతి రౌద్రాకారంబుతోఁ బంచముఖముల ధరించి శతకంఠు కంఠములనుండి కారు రక్తమును గ్రిందఁ బడనీయక శుష్కింపఁ జేయుచు సీతాదేవితోఁ దల్లీ! నీవు జగన్మాతృ స్వరూపముతో బ్రహ్మాస్త్రముచే వీని బొడ్డును ఛేదించి యాగ్నేయాస్త్రంబుచే నందున్న సంజీవకరణులు దగ్ధంబు గావించి నారాయణాస్త్రమున వీని తలలు ద్రొల్లనేయు మన జానకి మహాశక్తిస్వరూప మూని శతకంఠు శిరంబుల ధరణిఁ బడవైచి సంహరించెను. దేవతలు సీతారామాంజనేయుల ధ్యానించి పూలవానఁ గురిసిరి. మఱియు మూర్ఛిల్లిన శ్రీ రామ సైనికులపై నమృతవర్షము గురిపించి పునరుజ్జీవితుల నొనర్చిరి. అంత శ్రీరాముఁడు శతకంఠు పుత్త్రిండగు నీలుఁ

పైతృకం బగు రాజ్యంబున బట్టాభిషిక్తుఁ జేసి సర్వసైనిక పరివృతుఁడై యయోధ్యకు మరలి వచ్చెను. బంధుమిత్రాదులు స్వస్వస్థానంబుల కరిగిరి.

## 7 మైరావణ వధ

శ్రీరాముఁడు కుంభకర్ణాదులఁ జంపఁ గినిసి రావణుండు పాతాళలంకేశ్వరుఁడగు మైరావణుని స్మరించి రామలక్ష్మణులను వధింపు మని కోరెను. మైరావణుఁ డట్లేయని నాఁటిరేయిఁ గూర్కియున్న రామలక్ష్మణులను మోసముచేఁ గొనిపోయి యొక పెట్టెలో నుంచి బీగము వైచి ప్రతాపలంకలోని కాళికాలయమున జాగ్రత్తపఱచెను. అంత హనుమంతుఁడు రామలక్ష్మణులఁగానక విభీషణాజ్ఞానుసారము పాతాళలంకఁ జేరి యందు దుర్దండి యను రావణానుజ తోడ్పాటుచే శ్రీరామలక్ష్మణులున్న తావెఱింగి యందుఁ గాపున్న రాక్షస వీరులఁ గాళికాదేవికి బలియొసంగి మైరావణునిసైతము ససైన్యముగ నాశక్తికి బలియిచ్చి యాతల్లివలనఁ జిరంజీవి యగునట్లు వరముఁ బడసి మైరావణు కుమారుని బాతాళలంక కధీశుఁజేసి తెల్లవారకమున్నే జాగరూకతతో రామలక్ష్మణులను స్వస్థానముఁ జేర్చెను. అంతలో సూర్యోదయ మాయెను. రామలక్ష్మణులు మేల్కనిరి. సుగ్రీవాది సర్వవానరులు మారుతి మహిమ కద్భుతపడి వినుచుండిరి. రామలక్ష్మణులును దద్వృత్తాంత మంతయుఁ దెలిసి హనుమంతుని గొనియాడిరి.

# 8 కాలనేమి వధ

రావణుఁడు తనయమోఘ ఘంటాశక్తిచే లక్ష్మణుని మూర్ఛపుచ్చగా నాంజనేయుఁడు సంజీవాద్రిఁ గొనరాఁ జనెను అప్పుడు రావణుఁడు మారీచానుజుండగు కాలనేమిఁ బిలిచి వోరీ! నీవేఁగి హనుమంతుని మోసపుచ్చుమన నాతండు తప్పదనుకొని మారుతి మార్గంబున నొక మహాన్యాశ్రమంబు కల్పించుకొనియుండెను. హనుమంతుఁడుదారిఁబోవుచుఁ దప్పితినేమో యని కనుగొన నామున్యాశ్రమమున కరిగి నీవె వఁడ వని యాకపటమౌని నడుగ నాతండు సర్వజ్ఞుండువోలె "నోయీ! హనుమంతుఁడా! నీ వృత్తాంత మంతయు నే నెఱుంగుదు. నీవు రామరావణ సంగరమునుండి వచ్చుచు న్నావు. ఇది యంతయు నాతపఃప్రభావముచేఁ గనుగొంటి నని యాంజనేయుని విశ్వసింపఁ బ్రయత్నింప హనుమ నాకుఁ దప్పిక యగుచున్నది. ఇందేదైన సరస్సుండినఁ జెప్పుమన్న నాతఁడొక సరోవరముఁ జూపించెను. ఆంజనేయుఁ డందు దప్పిక తీర్చుకొనుచుండ మకరమొకటి యాయన పాదముం బట్ట హనుమ విదిల్చి దాని నంతమొందింప నది దేవతారూప ముతో మారుతీ! ఈమౌనిని విశ్వసింపకుము. ఇతఁడు కాల నేమి యను రక్కసుఁడు. నిన్ను వంచింప మౌనివేషమూనె నని మాయమైనఁ బవనసుతుండు తిరిగి యాశ్రమమునకు వచ్చి సంజీవనాద్రిఁ గొనిరాఁ బ్రయాణము కాఁగా నా దంభముని హనుమా! రాముఁడెవఁడు? లక్ష్మణుఁడెవఁడు? వారు మిథ్య నీసంజీవనాచలానయనము వృథాప్రయాస మని శుష్కవేదాం

తము బోధింపఁ గ్రుద్ధుఁడై మారుతి యోరీ! నీవు మిథ్య యని ఒక పిడిగ్రుద్దున నాతని వీతాసుఁ జేయ నాతఁడు రాక్షస రూపంబున నేలఁ బడెను.

## హనుమంతుఁడు భీమునకు దర్శనమిచ్చుట

ఒకనాఁడు ద్రౌపది సౌగంధిక కుసుమములు దెచ్చి పెట్టుమని ధర్మజుఁ గోరెను. అతఁ డాలోచించుచుండ నేఁదెచ్చి పెట్టెదనని భీముఁడు వెళ్లెను. వారప్పు డరణ్యవాస మొనర్చు చు హిమవత్ప్రాంతమున నుండిరి. భీముఁడా పుష్పముకొరకు హనుమంతుఁ డుండు తావునకుఁ బైగాఁ బోవుచుండెను. అది చూచి యాంజనేయుఁడు భీముని బలముఁ బరీక్షింప దారి కడ్డముగాఁ బరుండి యుండెను. త్రోవ విడుమని భీముఁడాయ నను గోర నేను ముదుసలిని. కదలలేకున్నాను. దయచేసి వేలుదారిని బొమ్ము. లేదా నాతోఁకఁదొలగించుకొని పొమ్మ"ని హనుమ జబాబిచ్చెను. భీముఁడు "మహాక్షత్రియుఁడ నగు నేను వెనుకకు మరల"నని నిర్లక్ష్యముగా నావానరము వాలము తొలఁగఁద్రోయఁ బోయెను. కాని యది కదలలేదు. ఏమిది యని బలము కొలఁది బ్రయత్నించియు దానిని గదలింపఁ జాలక యాతఁడెవఁడో మహాపురుషుఁడని యెంచి నిజరూపుఁ దెలుప నాతనిఁ బ్రార్థింప మారుతి తన కలరూపుఁ దెలిపి భీమసేనుని కౌఁగలించుకొనెను. అంత భీముఁడు హనుమవలన సౌగంధిక పుష్పము లుండు తావెఱింగి హనుమంతుని నిజరూ పంబుఁ జూడఁ గోర నాతఁడు తన విశ్వరూపంబుఁ దమ్మునకుఁ జూపించెను. భీముఁడు నాశ్చర్యుఁడై

శ్లో॥ గోష్పదీ కృతవారాశిం
మశక కృత రాక్షసమ్
రామాయణ మహామాలా
రత్నంవందేఽనిలాత్మజమ్॥

బా॥ రా॥

అని ప్రార్థింప హనుమ యెప్పటరూపంబుఁదాల్చెను. భీముఁడు సంతోషించి యగ్రజా! మాకు దుర్యోధనాదులతో జరుగఁ బోవు యుద్ధమునఁ దోడ్పడవలయు నన్న "తమ్ముఁడా! నేను యుద్ధ మొనర్చిన భూమి పణఁకును. కాన నీ గదయందును అర్జునుని టెక్కెమునందును నిల్చి మీకు సాయ మొనర్తు నని హనుమ చెప్పెను. మారుతివలన నావాగ్దానముఁగొని భీముఁడు గమ్యస్థాన మలంకరించెను.

గద్య

ఇది శ్రీ హనుమత్ప్రసాదిత కవిత్వ నిశ్చయ సుజన విధేయ
పణుకునూళ్ళ గోత్రోద్భవ శ్రోత్ర కులజలధి శీతాంశు
రత్నాంబా వీరభద్ర తనయ శ్రీ సచ్చిదానంద
నామధేయ ప్రణీతంబైన హనుమద్విజ
యంబున ద్వితీయాధ్యాయము



ఓమ్

# శ్రీ హనుమదవతార తత్త్వము

1 ఆద్యః ప్రసన్న హనుమాన్
ద్వితీయో వీరమారుతిః,
తృతీయో వింశతి భుజ
శ్చతుర్థః పంచవక్త్రికః

2 పంచమోష్టాదశభుజ
శ్శరణ్యస్సర్వ దేహినామ్
సువర్చలాపతే ష్షష్ఠః
సప్తమంతు చతుర్భుజః.

3 అష్టమః కధితశ్శ్రీమాన్
ద్వాత్రింశ ద్భుజమండలః
నవమం వానరం రూపం
ఇత్యేవం నవరూపధృత్ ॥

పరాశర సంహిత.



శ్రీరామ



# హనుమద్విజయము

## తృతీయాధ్యాయము

---

## ఆంజనేయధ్యానము

శ్లో॥ ఆంజనేయం మహావీరం
మహాసత్వం మహామతిం
మహాదేవం మహాకాంతిం
రామదూత మహాం భజే ౧

శ్లో॥ మేరుపర్వత సంకాశ!
మైనాక పరిసేవిత!
సుగ్రీవ సచివా! మేయ!
వాయుపుత్ర! నమోఽస్తుతే ౨

శ్లో॥ అంజనా గర్భ సంభూత!
రుద్రవీర్య సముద్భవ.
సర్వాలంకార సంయుక్త!
వాయుపుత్ర నమోఽస్తుతే! 3

శ్లో॥ సృష్టి స్థితి నిదానంచ
సర్వలోకైక పాలకమ్
వానరాణామధిపతి
మాంజనేయం నమామ్యహమ్ ౪

శ్లో॥ ప్రబలం సుమహావీరం
త్రిమూర్త్యాత్మక తేజసమ్
మాణిక్య కుండలోపేత
మాంజనేయం నమామ్యహం ౫

శ్లో॥ దీర్ఘ కాయం మహాబాహుం
దీప్త లాంగూలభూషణమ్
భీమసత్వం సుపింగాక్ష
మాంజనేయం నమామ్యహం ౬

శ్లో॥ దయానిధిం పుణ్యరాశిం
ప్రభంజన తనూభవమ్
సంజీవనాద్రి ధర్తార
మాంజనేయం నమామ్యహమ్ ౭

శ్లో॥ సర్వశాస్త్రార్థ తత్త్వజ్ఞం
నవవ్యాకృతి పండితమ్
అంజనానందనం దేవ
మాంజనేయం నమామ్యహమ్ ౮

శ్లో॥ పరాశరనుతం దేవం
సర్వాలంకార శోభితమ్

బ్రహ్మచర్య వ్రతోపేతం
వాయుపుత్త్రం నమామ్యహమ్ ౯

శ్లో॥ సర్వాలంకార సంయుక్తం
సర్వవిద్యా విశారదమ్
దీర్ఘాయుషం రామభక్తం
వాయుపుత్త్రం నమామ్యహం ౧౦

శ్లో॥ కౌపీనధారణం దేవం
పుష్పమాలాయుతోరసమ్
బ్రహ్మజ్ఞాననిధిం సాధుం
హనూమంత మహంభజే ౧౧

శ్లో॥ ఆనంద హృదయానందం
భక్తకల్ప మహీరుహమ్
ఆంజనేయం వాయుసూనుం
భక్త్యాఽహం మనసా భజే ౧౨

శ్లో॥ సుముల్లంఘిత వారాశిం
సీతా శోక నివారకమ్
రామదూతం వాయుసుతం
హనూమంతం భజామ్యహమ్ ౧౩

శ్లో॥ కవితాభ్యాస సిద్ధ్యర్థం
శ్రోత్రవంశాంబుధీందునా
సచ్చిదానంద నామ్నాయ
మాంజనేయ నుతిః కృతా ౧౪

## 2 మంగళం

శ్లో॥ మంగళ వాయుపుత్రాయ
త్రిమూర్త్యాత్మకరూపిణే
మంగళం రామదూతాయ
వానరేంద్రాయ మంగళమ్

గ్ర॥ స్వ

## ఉపసంహారము

ఆంజనేయుని గుణములు వాచామగోచరములు. నే నల్పజ్ఞుఁడ నైనను నాయకుఁడు లోకోత్తర గుణుఁ డగుటచేఁ దద్విజయ ముపాదేయంబ.

ఇమ్మహాత్ముని లోకోత్తర గుణము లెవ్వి? యన 'త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి' అను వేదవాక్యముచేఁ బ్రతిపాద్యమానుఁడగువాయుమూర్తి కీతండు కొమరుఁడు. ఈతని జనయిత్రి తపస్వినియు నప్సరఃకుల లలామయు నగు నంజనాదేవి యన్న నీతని యాభిజాత్యము వేఱే చెప్ప నేల? మఱియుఁ ద్రిమూర్త్యాత్మకుఁడు.

ఆంజనేయుని రూపసంపదయు నమోఘము. విశాల వదనుండు, కంబుగ్రీవుండు, మహాబాహుండు, దీర్ఘ వక్షస్థలుండు, దీప్తలాంగూలుండు, తప్తకాంచనసన్నిభుండు నగు హనుమంతుని రూప మొకమారు స్మృతికిఁ దెచ్చుకొనుఁడు. మఱియు

శ్రీరామ సేవాపరుండును ద్విజగన్మోహనుండును బాలసూర్య ప్రభుండును, జగత్త్రయీజిత్వరుండును అగు నాం

జనేయుతో సమాన భాగ్యంబు గలవాఁడు మఱొక్కఁ డెవ్వండు గలఁడు? వాయునందనునితో సమానుఁ డగు దానశౌండుఁడు వేఱొక్కండు గానరాఁడు.

ప్రాణతుల్యములగు కవచ కుండలముల నీతఁడు తప్ప మఱెవ్వండు దానంబు చేయఁగలిగె ?

వాల్మీకి ప్రార్థితుఁడై తత్కీర్తికై నిజరామాయణంబు నిర్మూల మొనర్చిన యీతనికంటెఁ బరోపకార పారీణుఁడు మఱెవ్వఁడు గలఁడు.

'కోటీందుసూర్యప్రభ' మ్మని కవులచే వర్ణితమగు నీ మహావీరుని తేజము లోకాలోకపర్వతమును గూడఁ బ్రకాశింపఁ జేయుచున్నది. గుణాంబుధి యగు నీ సామీర చాతుర్య మెంతని వర్ణింతు?

'యత్ర విద్యా న తత్ర శ్రీః
యత్ర శ్రీ ర్న సరస్వతీ'

అను లోకోక్తిని మిథ్య గావించి విద్యాధనంబుల రెండింటికిఁ దన్నాటపట్టుఁ గావించుకొనినె. ఈ గుణరాశి పరిహాసంబు నకేని బొంకఁడు. కలలనేనిఁ బరాంగనలఁ గనఁడు. అరులందేని నింద నారోపింపఁడు.

రావణాదులతో సంభాషించు సందర్భంబున నీతని రాజనీతియు వాక్ప్రౌఢిమయుఁ గాంచనగును. నిగ్రహానుగ్రహ సామర్థ్యోపేతుఁ డగు నీతని సాటి ధృగవంతుఁ డనుటలో నతిశయోక్తి లేదు.

వాల్మీకి రామాయణముకన్న రసవత్తరముగా రామ చరిత్ర వ్రాయఁగలిగిన యీతని పాండిత్యము నెవఁడు ప్రస్తుతింపఁగలఁడు? ఈతఁడు శమదమాది గుణసంపదకును బ్రహ్మవిద్యకును బట్టుకొమ్మ యని యగస్త్య్య నంతవాఁడు చెప్పనీతని గుణాద్భుతత్వము వేఱే చెప్పవలయునా?

రావణ సంహారాదులం దీతని కార్యధురంధరత్వము వర్ణనాతీతము. తన్ను దూషించు రావణు సైతము మన్నించి నీతి నుపదేశించినయీతని యోర్పు మిగుల నుత్కృష్టము.

రావణ మైరావణాది మహావీరులతోడి రణరంగము లీతని శౌర్యహేమంబునకు శాణోపంబులు.

సుగుణ దండాధారంబున శోభిల్లు నేతత్కీర్త్యాతపత్రము భక్తపథికులకు నీడ నొసంగుచున్నది.

ఆంజనేయా! తెలిసినదిలెమ్ము. మాటచే నన్నుమన్నింతువే గాని మానస్సుతోఁ గాదు. నీమన యెప్పుడును రామ నామ మాధురినే గ్రోలుచుండును. శ్రీరామనామ స్మృతియే నీకుఁ బ్రాణేశ్వరి, యని ఈ మహానీయునికిఁ గల రామనామ ప్రీతిని బ్రేమయసి యగు సువర్చలాదేవి నిరంతరముఁ గొనియాడును. ఈ హనుమద్గుణరత్నాకరమునుండి యెన్ని గుణరత్నముల నెత్తి చూపఁగలము.

ఆకాశమే పత్రమై సప్తసాగరంబులే మషీపాత్రంబులై శేషుఁడే వక్తయై వివస్వంతుఁడే విలేఖకుఁడైనచో నీ గుణోత్తరుని గుణంబు లొకకొన్ని వర్ణింతు రని తలంతును.

ఇఁక నీ మారుతి గుణప్రదర్శనము విరమింతును నా. బోటివాఁ డిద్దానికిఁ గడంగుట సూర్యుని దీపముతోఁ జూపించుటం బోలును.

ఈ నా సాహసంబునకుఁ బెద్దలు క్షమింతురుగాక.



శ్రీః

# కృతజ్ఞత

నే నిందుఁ బూర్వికులు నాధునికులు నగు కవివరే ణ్యుల పద్యంబులు ప్రమాణంబుగాఁ గొంటిని. కాన శతకంఠ, సహస్రకంఠ, వాల్మీకి రామాయణకర్తలకును దదితర పూర్వ కవులకును నామనఃపూర్వక వందనముల నర్పించుచున్నాఁడను

ఆధునిక కవులగు శ్రీయుత వావిలికొలను సుబ్బారాయ ప్రభృతులకు నమస్కృతు లొనర్తును.

అనేక దోషములతోఁ దులఁదూగు నీ పొత్తమును శిష్యవాత్సల్యముతో సరిచూచి యిచ్చిన యస్మద్గురువరేణ్యు లును వ్యాకరణాచార్యులు, నగు మధ్వశ్రీ వళ్ళై పూర్ణ ప్రజ్ఞాచార్యులు గారికి నా హృదయపూర్వకాభివందనములు.

ఏత ద్గ్రంథ ముద్రణమునకు వలయు ద్రవ్య సాహాయ్య మొనర్చిన సౌభాగ్యవతి శ్రీమతి క్రొత్త శ్రీ లక్ష్మినారా యణాంబను దేవుఁడు దయార్ద్ర దృష్టితోఁ జూచి సర్వ సౌఖ్య ముల నొసఁగు గాక.

నాకుఁ బౌరాణిక విజ్ఞానంబు నంకురింపఁజేసి మఱియుఁ బెక్కు సాయంబులొనర్చిన చిరంజీవి జంపాల లక్ష్మిదేవమ్మకు దేవుఁడు మనశ్శాంతి యొసంగుఁగాక.

పైవారి సాయము లేనిదే నే నీ గ్రంథమును బ్రకాశ మొనర్చియుండను గానఁ బూర్వోక్త మహాశయుల కెల్లను బునఃపునరస్మదీయాభివందనములు.

ఇట్లు,
వినీతుఁడు

**శ్రీ కొత్త సచ్చిదానందమూర్తి**

గ్రంథకర్త



ఓమ్

# ప్రార్థన

శ్రీరామ భక్తుఁడవును భగవదంశ సంభూతుఁడవును విశ్వనాథుండవును అగు శ్రీమ దాంజనేయ మహాప్రభూ ! అంతమందు నీతో నే మేమని విన్నవింపఁగలము?

శ్లో॥ "త్రాయస్వే తనువాద ఏవ
భువనత్రాణైక బద్ధవ్రతే
త్వద్భృత్యా ఇతి సిద్ధ సాధన మిదం
విశ్వైకనాథే త్వయి
త్వద్గత్యేవ సతిం గతాస్స్మ ఇతి చ
స్పష్టార్థమంశే హరేః
కుక్షిస్థాఖిల విష్ట పస్య సదృశం
కిం వాత్ర విజ్ఞాప్యతే" ప॥ రు॥

కాన నో మహాప్రభూ !

శ్లో॥ భూరస్తు సంపన్న సమస్త సస్యా
భూదేవతాః పూర్ణ మనోరథాశ్చ
భూపాశ్చ ధర్మ ప్రవణైక చిత్తాః
సర్వే జనా స్సంతు నిరామయాశ్చ ప॥ రు॥

ఇట్లు,
ప్రార్థయిత,
శ్రీ కొత్త సచ్చిదానందమూర్తి,
గ్రంథకర్త

శుభమస్తు　　　　　　　　　　　　　　　　　　అవిఘ్నమస్తు.

# ఫలశ్రుతి

---

శ్లో॥ బుద్ధిర్బలం యశోధైర్యం
నిర్భయత్వ మరోగతా
అజాడ్యం వాక్పటుత్వం చ
హనూమ త్స్మరణాద్భవేత్

శ్లో॥ త్వమేవ మాతా చ పితా త్వమేవ
త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమ దేవదేవ

శ్లో॥ జగతి నిఖిల విద్యాసింధుముష్టిం ధయానాం
పరఫణితి పరీక్షాయుజ్యతే సజ్జనానామ్
తదిహమమనిబంధే దూషణం భూషణంవా
భవతి యది విదగ్ధై స్సుధ్యవశ్యం విమృశ్యమ్.

శ్లో॥ శ్రోత్రాన్వవాయ జాతేన
సచ్చిదానంద మూర్తినా
భక్తానా ముపకారార్థం
హనుమద్విజయం కృతమ్

## గద్య

ఇది శ్రీ హనుమత్ప్రసాదాసాదిత కవిత్వ నిశ్చయ సుజన విధేయ
పణుకునూళ్ళ గోత్రోద్భవ క్రొత్త కులజలధి శీతాంశు
రత్నాంబా వీరభద్ర తనయ శ్రీ సచ్చిదానంద
నామధేయ ప్రణీతంబైన హనుమద్విజ
యంబున దృతీయాధ్యాయము
సర్వము సమాప్తము.

"సంగచ్ఛధ్వం సంవదధ్వమ్ సంవోమనాంసి జానతాం"

ఋగ్వే. అ. 8

ఇత్యాశాస్మహే.

ఓం శాంతిః శాంతిః శాంతిః



# ధ్యానశ్లోకములు

---

గ్రంథకర్తయొక్క 'సంగమేశాష్టకము' 'వేణుగోపాల స్తోత్రము' 'స్తోత్రరత్నావళి' 'సంగమేశ్వర స్తోత్రరత్నములు అను వేర్వేరు పుస్తకముల నుండి

శ్రీః

అథ సంగమేశాష్టకమ్

యస్యా భవ ద్భూషణ మస్థిమాలా
శిరోమణి ర్యస్య హిమాంశు రేఖా
నమామి భక్తాశ్రిత కల్పవృక్షం
జాగర్లమూడిస్థిత సంగమేశమ్ 1

మృకండు పుత్రో యదనుగ్రహేణ
శ్చిరాయురవాప్యాయు రవాపదీర్ఘమ్
నమామి తం చేతసి పార్వతీశం
జాగర్లమూడి స్థిత సంగమేశమ్ 2

మా మాశ్రయద్బాణ ఇతి స్మ తస్య
గేహేఽభవ స్త్వం శివ! రక్షకః ప్రాక్
త్వాం తాదృశం భక్తహితం నమామి
జాగర్లమూడి స్థిత సంగమేశమ్ 3

సర్వేషు దేవేషు భయాకులేషు
త్వమా పిబో హాలహాలం మహాత్మన్
త్వా మాశ్రయే శూలధరం గిరీశం
జాగర్లమూడి స్థిత సంగమేశమ్ 4

నిజావమానేన సతీ వినష్టా
దక్షాధ్వరే చేతి రుషా తతర్జ
యో దక్ష, మీడే హృది వీరభద్రం
జాగర్లమూడి స్థిత సంగమేశమ్ 5

నిరంతరం త్వాం స్మరతాం జనానాం
కరోషి తత్పాప వినాశనం త్వమ్
భజామ్యతః పాపవినాశనం త్వాం
జాగర్లమూడి స్థిత సంగమేశమ్ 6

నిరాకృతే స్వశ్వశురేణ ఋజ్జే
గోవిందదాసే శరణం ప్రపన్నే
సమాగతం సాక్షితయాత్ర సేవే
జాగర్లమూడి స్థిత సంగమేశమ్ 7

మృత్యుంజయం చంద్రకిరీటయుక్తం
కురంగహస్తం గణనాయకాంశమ్
శ్రీసచ్చిదానంద కృపం భజే త్వాం

జాగర్లమూడి స్థిత సంగమేశమ్ 8

కవితాభ్యాససిద్ధ్యర్థం
శ్రోత్రాన్వయభువా మయా
సచ్చిదానంద నామ్నేదం
సంగమేశాష్టకం కృతమ్

---

ఓమ్

శ్రీః



అథ శ్రీ వేణుగోపాల స్తోత్రమ్

క్రుద్ధే మహేంద్రే వ్రజ భూమిభాగే
శిలాస్సమా వర్షతి రక్షితుం తాన్
గోవర్ధనం యోఽధర దవ్యయస్తం
శ్రీవేణుగోపాల మహం భజామి 1

ఆత్మీయమాతా పితరావజస్రం
పుత్రార్థిమంతౌ చ విధాయ దీనౌ
యోఽక్లేశయత్ కంసమిమం ద్విషంతం
శ్రీవేణుగోపాల మహం భజామి 2

బర్హిబర్హి ధరం దేవ
నీలమేఘసమచ్ఛవిమ్
జాగర్లమూడి వాస్తవ్యం
వేణుగోపాల మాశ్రయే 3

కుచేల మునినా దత్తాన్
పృథుకాన్ ముష్టిమాత్రకాన్
గృహీత్వాఽదాత్ శ్రియంయస్తం
వేణుగోపాల మాశ్రయే 4

రుక్మిణీ దయితం కృష్ణం
సత్యభామా ప్రియం హరిమ్
కాళిందీ హృదయానందం
వేణుగోపాల మాశ్రయే 5

వసుదేవ సుతం దేవం
దుష్టరాక్షస మర్దనమ్
నమామివిశ్వగోప్తారం
కౌస్తుభాలంకృతోరసమ్ 6

శ్రీవత్సాంకిత వక్షస్కం
ద్వారకావాసినం పరమ్
నమామి హృదయే నిత్యం
హృషీకేశం రమాపతిమ్ 7

కృష్ణం యదుకులోత్తంసం
వసుదేవసుతం హరిమ్
జగద్గురుం నరసఖం
నమామ్యన్యాదృశం విభుమ్ 8

బలరామానుజం కృష్ణం
శిశుపాలాంతకం హరిం
ద్రౌపదీరక్షకం దేవం
విభుం నిత్యం సమాశ్రయే 9

కాళీయాహి ఫణాజాలే
నృత్యంతం గోపబాలకమ్
నమామి హృదయే నిత్యం
వేణుగోపాల దైవతమ్ 10

అమంద హృదయానందం
భక్తకల్ప మహీరుహమ్
వేణుగోపాల నామాన
మిష్టదైవ మహం భజే 11

వేణుం దధానం స్వకరాంబుజేన
సమ్మోహయంతం వ్రజసుందరీణామ్
చేతాంసి చామపురే వసంతం
శ్రీవేణుగోపాల మహం భజామి 13

కవితాభ్యాస సిద్ధ్యర్థం
క్రొత్తాన్వయభువా కృతా
సచ్చిదానంద నామ్నేయం
వేణుగోపాల సన్నుతిః

---

ఓం

శ్రీః

# అథ శ్రీ స్తోత్రరత్నావళిః

మొదటి భాగము

## నవగ్రహముల ధ్యానము

---

బృహస్పతిం దైత్యగురుం
బుధం చైవ శనైశ్చరమ్
అంగారకం సైంహికేయం
నమామి హృదయే నిశమ్ 1

కర్మసాక్షిణ మాదిత్యం
గ్రహరాజం విభావసుమ్
శనైశ్చరం చ తత్కుమారం
భక్త్యాహం మనసా భజే 2

కుముదానాం ప్రియం సోమం
జైవాతృకం క్షపాకరం
ద్విజరాజం కళానాథం
మృగాఙ్కం చంద్ర మాశ్రయే 3

రెండవ భాగము

## అష్టదిక్పాలకుల ప్రార్థన

---

వర్షాధిపం శచీనాథం
సహస్రాక్షం సురేశ్వరమ్

పురుహూతం శునాసీరం
ఇంద్రం వాసవమాశ్రయే 1

రజోమూర్తిం రక్తవర్ణం
కుమారపితరం శుచిమ్
ద్విముఖం చ మహాసత్వం
అగ్నిదేవం నమామ్యయమ్ 2

నరకాధిపం పితృపతిం
సమవర్తి సమవ్యయమ్
మహాప్రాజ్ఞం మహావీర్యం
యమదైవం నమామ్యహమ్ 3

రాత్రించరం మహాసత్వం
యాతుధానం పుణ్యజనమ్
రాక్షసం కోణపం రక్షః
నైఋతిం చ నమామ్యహం 4

ప్రచేతస మపాం నాథం
ఉదవాసం మహాబలమ్
దేవం పశ్చిమ దిక్పాలం
వరుణం చ నమామ్యహమ్ 5

ప్రభంజనం జగత్ప్రాణం
పృషదశ్వం సుగంధినమ్
సమీరణం నభస్వన్తం
వాయుదేవం నమామ్యహమ్ 6

యక్ష రాజం గాజ రాజం
శ్రీదం పుణ్యాజ నేశ్వరం
ధనదం త్ర్యంబక సఖం
నమామి హృదయేనిశమ్ 7

శివం దేవం పశుపతిం
వృషభ ధ్వజ మీశ్వరమ్
ఈశా నేశ్వర మీశానం
భక్త్యాహం మనసా భజే 8

మూండవ భాగము

## మహర్షి పూజ

---

వ్యాసం మహామునిం చైవ
వాల్మీకంతు మహాఋషిమ్
బ్రహ్మాభిజ్ఞం శుకం చైవ
నమామి హృదయేనిశం 2

కశ్యపాత్రి భరద్వాజాన్
జామదగ్నించ గౌతమమ్
విశ్వామిత్రం వశిష్టంచ
నిత్యం హృది నమామ్యహమ్ 2

నాలుగవ భాగము

## గీతాప్రశంస

పార్థాయ వాసుదేవేన
బోధితే సర్వసమ్మతే
మాతర్గీతే దేహి మహ్యాం
జ్ఞానం విద్యాం చ యశోధికమ్ 1

సర్వాధ్యాత్మ జ్ఞాన సిద్ధే
సర్వర్షి గణసంస్తుతే
జ్ఞానవిద్యా యశోధికైః
మాతస్త్వాం ప్రణమామ్యహమ్ 2

ఐదవ భాగము

## వినాయక ధ్యానము హయగ్రీవస్తుతి

వినాయకం గణాధ్యక్షం
భూత నాథాంక సేవితమ్
గజానన ముమాపుత్రం
హృదినిత్యం నమామ్యహమ్ 1

శ్రీపతిం హయవదనం
సర్వ విద్యానిధిం హరిమ్
నిర్మల స్ఫటికాకారం
భక్త్యాహం మనసా భజే 2

చతుర్భుజం హయగ్రీవం
సర్వ లోకపతిం హరిమ్
విద్యైశ్వర్య ప్రదానార్థం
హృది నిత్యం నమామ్యహమ్ 8

ఆరవ భాగము

## దేవీస్తోత్రము

---

సరస్వతీ విశాలాక్షీ
సర్వదైవత సంస్తుతే
అంబ మే కురు నిర్విఘ్నం
సర్వకాలేషు బాదరాత్ 1

లక్ష్మీం పద్మాలయాం పద్మాం
రమాం మంగళ దేవతామ్
లోకైక జననీం దేవీం
హృది నిత్యం నమామ్యహమ్ 2

కాత్యాయనీం హైమవతీం
చండికా మంబికాంశివాం
మృడానీం సర్వ మాంగళ్యాం
అపర్ణాం పార్వతీం భజే 3

---

శ్రీః

## అథ శ్రీ సంగమేశ్వర ధ్యానామృతమ్

గంగాధరం శివమ్ దేవం
గౌరీనాథం త్రిలోచనం
మహాదేవం వామదేవం
జ్ఞానైశ్వర్యార్థ మాశ్రయే 1

శర్వం దేవం పశుపతిం
వృషభధ్వజ మీశ్వరం
ఈశానేశ్వర మీశానం
జ్ఞానైశ్వర్యార్థ మాశ్రయే 3

శంకరం శాశ్వతం శంభుం
ఉగ్రం భీమం మహేశ్వరమ్
విరూపాక్షం మహాదేవం
జ్ఞానైశ్వర్యార్థ మాశ్రయే 3

అక్షరం శ్రీనిధిం శర్వం
భర్గం భీమం జగద్గురుమ్
కాలాంతకం చతుర్బాహుం
జ్ఞానైశ్వర్యార్థ మాశ్రయే 5

ఆనందహృదయానందం
భక్తకల్ప మహీరుహామ్
జాగర్లమూడి వాస్తవ్యం
సంగమేశం నమామ్యహామ్ 6

కళానాథ ధరం దేవం
శరద్మేఘ సమచ్ఛవిమ్
జాగర్లమూడి వాస్తవ్యం
సంగమేశం నమామ్యహమ్ 7

సర్వశాస్త్రార్థ తత్త్వజ్ఞం
సర్వవిద్యా విశారదమ్
జాగర్లమూడి వాస్తవ్యం
సంగమేశం నమామ్యహమ్ 8

త్రినయన ధారిన్
పశుపతి నామన్
శశిముఖ నిత్యం
కురు మమ సౌఖ్యమ్ 6

దుర్గే శివే కాళి గౌరి
భవానీశ్వరి నిర్మలే
అంబ మే దేహి సత్యం చ
వీర్యం విద్యాం యశోధికమ్

ఇది శ్రీ సచ్చిదానంద విరచితం బైన హనుద్విజయ మందు స్తోత్రప్రకరణము సర్వము సంపూర్ణము.

మంగళం మహత్

సర్వే లోకాః సుఖినోభవంతు

---